# చైతన్యోదయ

## 8

శుక్ల శరత్తు ❊ AUTUMN 1989

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

❊

చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
October 1989, pp. x + 60.

ముఖచిత్రం : నేటి జ్ఞానపీఠ ప్రశస్తి విజేత సినారె

వెనుక వైపు : నాటి జ్ఞానపీఠ ప్రశస్తి విజేత విశ్వనాథ
(కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ సౌజన్యంతో)

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

వెల : రూ. 10-00 (వార్షిక సభ్యత్వం రూ. 15-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Prof. T. V. Subba Rao**
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# శుక్ల శారద

ఇన్నాళ్లకు మళ్లీ తెలుగు వెలుగు భారత దేశమంతటా ప్రసరించింది. మన సినారెగారికి జ్ఞానపీఠ ప్రశస్తి లభించింది. ఇది మనందరికీ గర్వ కారణం. చైతన్య కవితా వేదిక డా. సి. నారాయణరెడ్డిగారిని నిండుమనసుతో అభినందిస్తోంది.

తెలుగు భాషా సాహిత్యాలు ఇతర భాషా సాహిత్యాలకు తీసిపోవు. అయినా జ్ఞానపీఠ పురస్కారానికున్న పాతికేళ్ళ చరిత్రలో రెండుసార్లు మాత్రం తెలుగు గుర్తింపబడడం శోచనీయం. దీనికి ప్రతిభా దారిద్ర్యంకన్న సాహిత్యేతర రాజకీయాలే కారణమనిపిస్తుంది. జ్ఞానపీఠ ప్రశస్తికి అర్హులైన తెలుగువారు పెక్కుమంది ఉన్నారని డా. సినారె గారనడం వారి సౌజన్యానికి ప్రతీక.

ఆంధ్రుల ప్రతిభా పాండిత్యాలు గుర్తింపు పొందక పోవడానికి మరో కారణం మన సాహిత్యం ఇతరులకు అందకపోవడం. కన్నడంలాంటి భాషల్లో రచితమైన ఉత్తమ సాహిత్యమంతా ఇంగ్లీషు ద్వారా ఇతరులకు పరిచయం చేయబడుతోంది. ఈ పనిని ముఖ్యంగా విశ్వవిద్యాలయాలు, అకాడెమీలు, కొన్ని సంస్థలు నిర్వహిస్తున్నాయి. తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా కూడా కార్యభారాన్ని వహించిన డా. సి. నారాయణరెడ్డి గారు, తెలుగు సాహిత్య సౌరభం ఇతర ప్రాంతాలలో గుబాళించేందుకు తగిన చర్యల్ని తీసుకోవాలి. ఇలాంటి పనిని చేపడ్తే తెలుగువారు ఆయన్ను తర తరాలు గుర్తుంచుకుంటారు.

తెలుగువారికి మొదటి జ్ఞానపీఠ ప్రశస్తిని ఆర్జించి పెట్టిన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని ఈ సమయంలో స్మరించుకుంటున్నాం. వారి బ్రాహ్మీమయమూర్తిని జీవకళ ఉట్టిపడేట్లు ఛాయా చిత్రంగా తీయించిన కాకతీయ విశ్వవిద్యాలయాంధ్ర శాఖ వారి సౌజన్యంతో ఈ సంచిక అట్టవెనుక విశ్వనాథవారి చిత్రాన్ని ముద్రించాం.

సంపాదకులు

# ఈసారి వేదిక నలంకరించినవారు

అనువాద కవిత

# మనిషికి పెట్టిన నగిషీ*

కవిత్వం ఊపిరి పీలుస్తున్నట్లనిపిస్తుంది కవిగా నారాయణరెడ్డి మాట్లాడుతుంటే. కృష్ణుడు వేణువు మ్రోగిస్తున్నట్లుంటుంది గీతిని విరచిస్తుంటే. మట్టిని సైతం మాణిక్యం చేస్తున్నట్లుంటుంది వచన రచన సాగిస్తుంటే; మనిషిలో మానవత స్పందిస్తున్నట్లుంటుంది మధుర కవిత వినిపిస్తుంటే. కవితకు నవత కల్పించటం నారాయణరెడ్డిగారి కవితా వ్యక్తిత్వం.

కాలం వెంట నడవటం, కలాన్ని కళామయంగా నడపటం, సంప్రదాయంలోని స్తబ్ధతను నిరసించటం, క్రొత్తదనంలోని ఉత్తమగుణాన్ని కవితా హృదయానికి హత్తుకోవటం, ప్రయోగాన్ని ప్రయోజనం తెలిసి ప్రయోగించటం, ఉక్తి శక్తితో వస్తుశక్తిని ఉన్మీలింప చేయటం. నారాయణరెడ్డిగారి కవితకు ఉగ్గుతో వచ్చిన విద్యలు. వారికి నాద హృదయం తెలుసు; శబ్ద సంయోజనం తెలుసు; అర్థశక్తి తెలుసు. పద్యం వ్రాసినా, గేయం రచించినా, వచనగీతం చిత్రించినా, ప్రకృతికి తగిన ఆకృతినీ, నిర్మితికి తగిన నిర్వహణాన్నీ, అభివ్యక్తికి తగిన అలంకృతినీ, శీలానికి తగిన శైలినీ కూర్చటంలో వారిది అందె వేసిన చేయి.

నారాయణరెడ్డిగారు మూడు దశాబ్దాలుగా రచన చేస్తున్నారు. భారత స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పరిస్థితుల ప్రభావమే వీరి మీద బలంగా కనపడుతుంది. స్వాతంత్ర్యోద్యమంలో పుట్టి ఆ తరువాతి దేశ స్థితిగతుల్ని తనలో ప్రతిబింబించుకొన్న రచనల కంటె నారాయణరెడ్డిగారి రచనలు భిన్నంగా కనపడాలి; కనపడుతాయి కూడా. భారత దేశంలో ఈ మూడు దశాబ్దాల్లో ఎన్నో మార్పులు వచ్చాయి. వర్గపోరాటాల స్పృహ సమాజంలో హెచ్చింది; సమ సమాజ నిర్మాణాకాంక్ష ప్రబలింది; విదేశాల దాడులు వచ్చాయి. విజయాలు, అపజయాలూ, సంధులూ, రాయబారాలు జరిగాయి. రాజకీయ చైతన్యం సామాజిక ప్రధాన ప్రవృత్తిగా సాగింది. ప్రపంచ దేశాల విముక్తి పోరాటాల్లో భారతదేశం కీలక పాత్ర నిర్వహించింది. ఇవన్నీ సాహిత్యాన్ని, కళారంగాన్నీ ప్రభావితం చేశాయి. ఫలితంగా—కవుల్లో

---

* డా. తిరుమల శ్రీనివాసాచార్యగారి 'నారాయణరెడ్డి సాహితీమూర్తి'కి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు రాసిన పీఠికనుంచి.

అభ్యుదయవాదులూ, విప్లవవాదులూ, జాతీయవాదులూ ఏర్పడ్డారు. అభ్యుదయవాదుల్లో మానవతావాదమార్గం సాహిత్యంలో వివిధ ప్రయోగాలను సాగించింది. నారాయణరెడ్డిగారు ఆ మార్గంలో తమ ప్రయోగాలు ప్రధానంగా నిర్వహించారు. చిత్రమేమిటంటే–నారాయణరెడ్డిగారి మానవతావాదం కవితలో స్ఫటికంలా భాసిస్తుంది. దానిలో వివిధవాదాల ప్రతిబింబాలూ కనపడతాయి. అయితే అవి దానిలోని ప్రతిబింబాలుగానే నిలుస్తాయి. ఉదాహరణకు–రెడ్డిగారి కవితలో హేతువాదం, సౌందర్యవాదం, విప్లవవాదం, ఆశావాదం, అనుభూతివాదం, రీతివాదం, అలంకారవాదం, చమత్కారవాదం, ప్రతీకవాదం—ఇవన్నీ అవసరానికి అనువుగా నిలిచి అంతర్లక్షణాలుగా అలంకృతు లవుతున్నవి వీటన్నింటికి మకుటంగా మానవతావాదం నిలుస్తుంది. అందుకే ఆయన్ను సామాన్యంగా అంటుంటారు ఏయిజాలకూ కట్టుబడరని. ఎవరికీ అందకుండా, ఎందులోనూ ఇరుక్కోకుండా ఎగిరెగిరి పోతారని. అలా రెక్కలతో ఎగిరి విహంగవీక్షణంతో సమకాలీన సాహితీ పరిణామాలను సమీక్షిస్తూ తన మానవతావాదాన్ని మూర్తి కట్టించటమే వారి సాహితీ వ్యక్తిత్వం.

'శిశిరంనుంచి వసంతానికి
చీకటినుంచి ప్రభాతానికి
నిరాశనుంచి ఆశాశిఖరానికి
అశ్రుజలధినుంచి ఆనంద తీరానికి
నడిపించే మార్పు
నేనిచ్చే తీర్పు'

అని తన ధ్యేయాన్ని డా. సి. నారాయణరెడ్డిగారు పేర్కొన్నారు. సృజనాత్మకతను కోల్పోయిన సంప్రదాయంనుండి వినూత్న ప్రయోగాన్ని విస్ఫులింగంలా ప్రజ్వలింప చేయటం, సమకాలీన ప్రయోగాలలో మానవతను మంటకలిపే విధ్వంసక ప్రవృత్తులను గర్హించి సమాజశ్రేయోభావనకు చింతనురేకెత్తింప చేయటం, సమాజంలో అవినీతిశక్తుల విలయతాండవాన్ని తప్పించుకోలేని మూగజీవుల ఆర్తనాదాలకు ఆశాగీతాలను అలపించి వినిపించటం, ఆర్తిని బడబాగ్నిగా భరించే వ్యథార్తజీవుల అంతర్వేదనాన్ని అశ్రుగీతాలుగా వినిపించటం, మానవాహంకారం సాగించే ప్రగతియాత్రలో అరనిమంటలా వెలుగును చిమ్మే అంతరాత్మ చైతన్యాన్ని అంతర్ముఖంగా భావించి ప్రతీకాత్మకంగా ప్రపంచించటం-ఇవన్నీ డా. నారాయణరెడ్డిగారి కవితలో ప్రతిబింబించే మార్పులు-వినిపించే తీర్పులు.

డా. నారాయణరెడ్డిగారి సాహితీమూర్తి ఒక చైతన్య శిఖరం. పూల పాటలు పాడుతూ నవ్వనిపువ్వుల్ని నవ్విస్తూ అజంతా సుందరులను కవ్వించి పగలే వెన్నెల కల్పించగలరు. వెన్నెలవాడను వేయింపగలరు జలపాతంలా దూకి విద్యుత్ హరివిల్లులను సృష్టించి, దివ్వెల మువ్వలు మ్రోయించి తేజస్సే నా తపస్సని ప్రకటింపగలరు; అక్షరాల గవాక్షాల్లోనుండి మధ్యతరగతి మందహాసాన్ని దర్శించి, ఉదయం నా హృదయమని ప్రకటింపగలరు. మంటలలో మానవుణ్ని చూచి, మృత్యువుతో ముఖాముఖి మాట్లాడి, మథనంలో అమృతాన్ని సాధించి విశ్వగీతి వినిపించగలరు. రెడ్డిగారి ఖండకావ్యాలూ, గేయనాటికలూ వస్తువైవిధ్యంతో పాటు శిల్పవిన్యాసాన్ని కూడా చిత్రీకరింప గలిగే కళామూర్తులు.

కథాగేయ కావ్యకర్తగా డా. నారాయణరెడ్డిగారికి అఖండకీర్తి లభించింది. నాగార్జునసాగరం, స్వప్నభంగం, కర్పూరవసంతరాయలు, విశ్వనాథ నాయడు, జాతిరత్నం మొదలైనవి తెలుగులో మాయని మనోజ్ఞకళాఖండాలు. వారి ఋతుచక్రంలో తెలుగుఋతువులు ఆత్మాశ్రయ కవితావగుంఠనాన్ని అలంకరించుకొని ముద్దులు మూటకట్టాయి రామప్ప నాటిక భారతీయ భాషలన్నిట్లో పరివర్తనం చెందింది; రాళ్లను కరిగించింది; ఒడళ్లను పులకింప చేసింది. వారి సమదర్శనం సూక్తిసుధాకరం. అనుసృజన సాహితి ముత్యాలపల్లకి. యాత్రాసాహితి అంతర్జాతీయ స్నేహసౌరభాలకు అక్షర సుమాలమంజరి. వ్యాససాహితి సమీక్షాసదస్సు. పరిశోధన సాహిత్రిప్రామాణిక విమర్శకు బంగరుగద్దె. గద్యంలో జాలువారిన రచన వారి విమర్శ, వారివ్యాఖ్యలు మందారమకరందాలు. వారి సినీగీతాలు కవితాజలధికి ఏతాలు. పట్టింది బంగారం చేయటం, ప్రయోగంలో పరిణతిని ప్రకటించటం వారి నైజం. వారి విశ్వంభర మానవతావాద కవితలో వెలువడిన మహాకావ్యం. సమకాలీనుల్లో శ్రీనాథుడు డా. సి. నారాయణరెడ్డి!

'ప్రకృతిలోని చలనశీలానికి
పరిణామం మనిషి
జగతిలోని భ్రమణగుణానికి
ప్రతిరూపం మనిషి'

ఆమనిషికి పెట్టిన నగిషీ డా. నారాయణరెడ్డి కవితాకృషి!

జి. వి. సుబ్రహ్మణ్యం

## ఉపద

— శ్రీశ్రీ

(1976లో విశ్వనాథ పరమపదించినప్పుడు శ్రీశ్రీ వ్రాసిన కవిత. 1976 నవంబరు స్వాతి మాసపత్రికలో ప్రకటితం.)

మాటలాడే వెన్నెముక
పాట పాడే సుషుమ్న
నిన్నటి నన్నయ భట్టు
ఈనాటి కవిసమ్రాట్టు
గోదావరి పలకరింత
కృష్ణానది పులకరింత
కొండవీటి పొగమబ్బు
తెలుగువాళ్ళ గోల్డు సబ్బు
అకారాది క్షకారాంతం
ఆసేతు మిహికానంతం
అతగాడు తెలుగు వాడి ఆస్తి
అనవరతం తెలుగునాటి ప్రకాస్తి
ఛందస్సులేని ఈ ద్విపద
సత్యానికి నా ఉపద.

## సి. నారాయణ రెడ్డి

ఎవరికి ఈ సన్మానం
ఎందుకు ఈ సన్మానం ?
చెట్టంతటి పేరొందిన
చిగురుకు ఈ సన్మానం.

అమ్మగ; సింగిరెడ్డి బు
చ్చమ్మగ కమ్మగ ననుకని
పెంచిన మా హనుమాజీ
పేటకు ఈ సన్మానం.

పదుగురు పాలేర్లున్నా
పదరా అని మా నాయన
మల్లన దున్నిన రేగడి
మట్టికి ఈ సన్మానం.

"నీయవ్వా అరే" అంటు
నీర్గే నా గొంతుకలో
కవితలు స్వరపరిచిన హరి
కథలకు ఈ సన్మానం.

ఉర్దూనే విద్యార్థిగ
ఊపిరిలా పీల్చుకున్న
నాలో తెలుగును మలచిన
నాల్కకు ఈ సన్మానం.

ఎంత పైకి ఎదుగుతున్న
ఇంకా పై కెదగమనీ
దీవించే నా ప్రియగురు
దేవులకీ సన్మానం.

ఏ రుతువైనా స్వరాల
తీరాలను ఒరుసుకునీ
ఏటి పాయలా ఉరికే
పాటకు ఈ సన్మానం.

సముద్రాలతో గీసిన
పరిహద్దులు చెరిపివేసి
మనుషుల ముడివేసిన నా
మాటకు ఈ సన్మానం.

అనుభవాల వెన్నముద్ద
లారగించినా; మనసుకు
జిడ్డంటని నారాయణ
రెడ్డికి ఈ సన్మానం.

పేరేమో సింగిరెడ్డి
నారాయణరెడ్డిగాని
కులంకీళ్లు విరిచే నా
కలానికీ సన్మానం.

## మౌనం అయిదు భాషల్లో

రాలిన పండుటాకుల మధ్య
మూలుగుతున్న పసిమి
చెట్టు గుండెలోకి చొరబడుతుంది.
చివరి మూలుగు
చిగురు భాష తొడుక్కుంటుంది.
చెట్టు ప్రసవిస్తుంది
పూల కళ్ళనూ పళ్ళ గుండెలనూ.
గాలి పొడెమీదినుంచి

ఎండుటాకుల శవాలు
నేలలోకి దూకుతాయి
వచ్చిన ఆకులు మురిగి మురిగి
పచ్చని మొక్కలకు ప్రాణం అరువిస్తాయి
పంటను మేసి హరాయించుకున్న నోళ్లు
పడిపోతాయి నురగలు నురగలుగా.
మట్టిలోంచి లేస్తాయి ఆ నోళ్లు
మౌనాన్ని అయిదు భాషల్లో ఊదుతూ.

## నా హృదయం (గజల్)

నా హృదయం చలించి పోగానే నడకలు నేర్చుకుంది ఆకాశం
నా నయనం భ్రమించి పోగానే నవ్వులు రాల్చుకుంది మధుమాసం.

తనలో తాను నీడ చూసుకుని తననే తడిపి ఆరవేసుకుని
ఎదలో తనకు చోటు చాలదనీ పెదవిని చేరుకుంది దరహాసం.

వీచే గాలి పిలుపు గమనించీ పూచే నేల ఎరుపు పరికించీ
పెదవుల బాసలింక చాలుననీ పిడికిలి కోరుకుంది ఆవేశం.

బ్రతుకే ఆటలాగ భావించీ పగలే కాగడాలు వెలిగించీ
ఆఖరి జాములోన చితిలోన అశ్రువు లేరుకుంది పరిహాసం.

ఎదురుగ ఎండమావి రమ్మన్నా ఇదుగో చేదబావి అంటున్నా
కదలని ఓ 'సినారె' నిను చూసీ కాలం మార్చుకుంది తన వేషం.

# విశ్వంభర

[ఇది వచన కవితలో సి. నా. రె. రచించిన సమగ్ర కావ్యం. ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాల విశ్వంభర. ఇతివృత్తం మనిషి కథ. నేపథ్యం ప్రకృతి. మనిషి ధరించే వివిధ భూమికలకు మూలధాతువులు మనశ్శక్తులు. ఆదిమదశనుంచి ఆధునిక దశవరకూ మనిషి చేసిన కళాత్మక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక ప్రస్థానాలు ఈ కావ్యంలోని ఐదు ప్రకరణాలు. ఐదవ ప్రకరణంలో చివరిభాగంనుంచి కొన్ని పంక్తులు క్రింద ఇస్తున్నాము—సం.]

"మనిషీ ! ఎక్కడ నువ్వెక్కడ?
మట్టిలోంచి మింటిలోకి చిమ్ముకొస్తున్నావా ?
నిర్మించుకున్న అహంకారాల ప్రాకారాలు
నేల మట్టమవుతుంటే
నిట్టూర్పుల శిథిలాలను
పట్టుకు వ్రేలాడుతున్నావా ?
పరమాణువుల శిరస్సుల్లో చొరబడి
పరికించిన సత్యాల పరమావధి
వినూత్న చైతన్య సృజనమా
విశ్వసృష్టి విధ్వంసనమా ?
ఎంత పచ్చగా వెలుగుతున్నది
ఇన్నాళ్లు నువ్వు పెంచిన సంస్కృతి
సహమానవ హననంలో
సమ జీవన దహనంలో."

అదే స్వరం అదే స్వరం
అధికారంలో ప్రతిధ్వనిస్తూ,
మనిషిలోని సంకల్ప మూలాన్ని
మళ్ళీ మళ్ళీ ఎత్తి పొడుస్తూ.
మనిషి చలించలేదు
మౌనాన్ని వర్షించాడు.

మాటలకందని శ్రుతిలో
మనస్సులో ఘోషించాడు.
ఇది నిత్య ప్రస్థానం
ఎగుడు దిగుళ్ల తప్పవు.

... .................................

.........................................

ఋషిత్వానికీ పశుత్వానికీ
సంస్కృతికీ దుష్కృతికీ
స్వచ్ఛందతకూ నిర్బంధతకూ
సమార్ద్రతకూ రౌద్రతకూ
తొలి బీజం మనస్సు,
తులారూపం మనస్సు.
మనస్సుకు తోడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి.
ఇదే విశ్వంభరాతత్త్వం
ఇదే అనంత జీవిత సత్యం.

## ఎదిగావా, అయితే విను !

(జ్ఞానపీఠబహుమతి వచ్చిన తర్వాత సి. నా. రె. రచించిన కవిత. 24-9-1989 నాటి ఆంధ్రజ్యోతి దిన పత్రికలో ప్రచురితం)

ఎంత ఎత్తు ఎదిగి పోయావు!
హిమాలయం నీ బెల్టు బకుల్‌లో
తన ముఖాన్ని చూసుకుంటున్నది.
నీ కాలిగోళ్ల కొలనుల్లో నక్షత్రాలు
నిలువీత లీదుతున్నాయి.
ఆకాశం జేబు రుమాల్లా
అద్దుతున్నది నీ నుదుటి చెమట గీతలను.
నువ్వు చిటికేస్తే
నిద్రపోతున్న స్వరలిపి ఎగిరిపోయి
రోదసీ గ్రంథంలో రెక్కల కృతులను ఆవిష్కరిస్తుంది.
నువ్వు అడుగేస్తే
స్తంభించిన వాయుమండలం తెరమీద
అంతర్ గ్రహాల చలన చిత్రాల జాతరలు.
ఇంతగా ఎదిగి పోయిన నువ్వు
గగన గామినీ పరిష్వంగ
గాంధర్వ బంధంలోనే ఆగిపోతే
నీ యెదుగుదల తెగినతల.
మొండెంలా మోకరిల్లుతూ బ్రతకకు
దిగిరా కురిసే మబ్బులా నేలపైకి
ఒళ్ళంతా లయతో
కళ్లనిండా దయతో............

# పాపినేని శివశంకర్

## వీ

ఈ క్షణం నా సమస్తం దేహమై పోనీ
దేహం గేహమంతా స్పర్శై పోనీ
వెన్నెల సముద్రం నీ రూపం
అలలు అలలై నన్ను తాకనీ

తొలి వినుకులు నేలను ముద్దాడిన చోట్లల్లోకో
చుక్కల జాజిపూల తోటల్లోకో
సుడిదిరిగిన లోలోపలి లోకాల్లోకో
మన పాదాలు నడిచి పోనీ

రెప్పల వెనక స్వప్నతీరాల్లో
నాడులపై మౌనరాగాల్లో
కరిగిపోయిన ఈ క్షణం
నన్ను నీలో వాస్తవీకరించుకోనీ

చూపులు విట్టి విషాదం ఒలికే వేళ
దారులు చీలి నడకని ప్రశ్నించే వేళ
ఒక జీవన నిష్ఫలత్వంలో
నీ కలయిక కాంతిద్వారాలు తెరవనీ

కాలం కనురెప్పల మధ్య
బాధా సంతోషాల ఈ బ్రతుకు ప్రమిదనే
కలకాలం మనం కాపాడుకోనీ.

## మాదిరాజు రంగారావు

### అగ్నిదీప్తి శాంతిరక్తి

నాలో అణువణువులో పృథ్వీరూపం
నాలో ప్రతికణం గాథాకాశం,
శక్తులు సంఘర్షించే సామాజిక రూపం
మానవతా సౌందర్యంతో జీవన దృశ్యం.

ఎవరి కోసమో ప్రతివ్యక్తి ఎదురు చూపి
ఎద నిరాశతో ప్రతి రోజూ ఒక ఎడారి.
ఇంటి ముందు వీధి దీపం నిలిపి చూచే
నాశతో సుదూర నక్షత్ర పథం వైపు !

నిదురనుండి లేవగానే సూర్యుని బింబం
ఎదురుగా సముజ్వలమై స్వప్న విభాతం
కళ్ళు నిల్పి చూచేందుకు వీలు కాదు
చేయి చాచి పొందేందుకు అందరాదు.
నా హృదయానికి ప్రతిబింబం
నా ముఖబిందు వివృత రూపం
బాధకూ వేదనకూ చిహ్నమై జీవితంలో
మంచు ఆలోచనలో హంసయై ఆత్మరూపం.
కాలం అంచున తీగపై నడచినట్లు
వస్తుందామె! మనోజ్ఞమై స్మృతి పథాన,
జ్ఞాపకాల నణచేస్తూ కన్నీటిని తోసేస్తూ
వేదనాగ్ని ప్రభవిస్తూ ఆలోచనకంటిస్తూ.

దీపస్తంభాలకు రాత్రి వేలాడే ముఖాలు
సూర్య తేజాన్ని ససేమిరా ప్రేమించలేవు!
జెండా కర్రకు నిల్పిన ముఖాలు సరాసరి
ఈ ధాత్రీస్థలి ధూళి కణాలను కోరవు!

నిశా దీన జీవితం చూచేందుకు కాంతి
జ్వలించేను మేల్కొనీ! ఆరాట పడేను.
కళ్ళు మూస్తే చీకటి! సముద్రమంత భయం
గుండెలోనో బావురు మనే విశాలనభం.

జీవనరూపం బింబించే నిలువెత్తు అద్దం
వీధి గణం దూకించే రాళ్ళకు ముక్కలైంది!
అడుగు వేస్తే అలంకరించేను గాయాలతో
మనిషిలో పొంచి ఉన్న హింసాపదం ముద్రవై!
నిశ! పేరుకొని నవ తుహిన శిఖరమౌతుంది
ఉష! జీవన శిలపయి వెలుగు నది ఔతుంది
గడ్డ కట్టిన నినాదం, సరించే అగ్ని కావాలి
స్తబ్ధమైన పదయుగ్మం, చలించే శక్తి కావాలి

జ్వాలా దర్పణంలో కన్పించేను వరసగా
మండే సంస్కృతీ చిత్రంలో మానవ హృదయం.
జ్ఞాపకాలు కన్పడకుండా! పొగ కప్పేస్తోంది
మధ్య మధ్య రవ్వలతో మానవతా మందారం!

వర్తమానం అంచులపై జనగణ దృశ్యం
ఉంది నాలో బింబితమై నవయుగ రూపం
అగ్నిశిఖలై అమృతకళలై వదలిపోయేరు
హింసితులు శాంతి ప్రియులు ప్రభావ పద చిహ్నాల్ని
ఉదార హృదయంతో పృథ్విస్వాగతమిచ్చేను
వినీల గగనం నక్షత్ర ప్రశ్నలు వేసేను.
నాలో అణువణువు సమాజ శక్తి నికేతనం
నాలోని కణకణము వ్యక్తి భూమికకాశ్రయం
చేతనలో అగ్నిదీప్తి ఎంత అవసరమో!
భావనలో శాంతిరక్తి అంత అవసరమో.

# తంగిరాల సుబ్బారావు

## ముంగిలిపట్టు నాయుడుగారు*

1

తెల్లటి మల్లుపంచె అడ్డకట్టు,
తెల్లటి పుల్లు షర్టు,
తెల్లటి చిరునవ్వు,
చల్లటి మీ మనస్సు
మంచులో తడిసిన మల్లెపువ్వు!
పచ్చటి దబ్బపండు ఒళ్లు,
విచ్చిన వెలిమి నెమలి కళ్లు!!

2

'నరాల వీరయ్య' యింట్లో
నా కురుక్షేత్రం పద్యాల వానలో తడుస్తూ వచ్చి
నా గుండె గడపలో అడుగు పెట్టారు.
మీ వెచ్చని హృదయం పచ్చదనంలోకి నన్ను నెట్టారు.
చంద్రగిరి శిఖరాల ఎత్తు మీమానవత్వంతో పెంచారు.
'కమలమ్మ'గారి వంటలో కాశీ అన్నపూర్ణను చూపించారు.
మధువు మత్తునూ
వధువు విత్తునూ

* చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, ముంగిలిపట్టు గ్రామంలోని కట్టా దొరస్వామి నాయుడుగారు (1930-1982). ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఎం. ఎల్. సి. అదికేశవులుగారి తమ్ముడు. 21-5-1982 నాఢురాత్రి ముంగిలి పట్టునుండి మోటరుసైకిలు మీద చిత్తూరు వెడుతూ రోడ్డు ప్రమాదంలో మరణించారు(?) ఈయన రైతు, పెద్దగా చదువుకో లేదు. అయినా గొప్ప సరసుడు, సహృదయుడు, స్నేహశీలి, పుంజీభవించిన మానవతా మూర్తి. నా జీవితంలో తటస్థ పడిన అరుదైన మహానుభావులలోఒకడు.

సృష్టి సత్తునూ
బ్రతుకు సంపత్తునూ
హరివిల్లులా ఆవిష్కరించారు.
మంచితనం
పెద్దమనిషి తనం
మీకు సహజ కవచ కుండలాలు.
మీరు
మాలాగ
కాగితాల మీది సిరామరకల్ని చదవలేదు.
ఏవో కొన్ని వ్యాసాలు కంఠస్థం చేసి డిగ్రీలు ప్యాసుకాలేదు.
కానీ—
మనుషుల్ని చదివారు.
మమతల్ని చదివారు.
మానవత్వాన్ని చదివారు.
ఉపకారాన్నీ. సహకారాన్నీ. సంస్కారాన్నీ చదివారు.

అందుకే—
మిత్రుల మనసు పొరల్లో
ఎన్నటికీ రంగులు మాసి పోని
ఉన్నతమైన అజంతా చిత్రాలు గీశారు;
ఎన్నో గుండెల మధ్య స్నేహ గీతికల్ని గుచ్చారు;
ఈ జీవనానంద తరంగిణికి పెద్ద వెల్లువ తెచ్చారు.

3

అడవి పువ్వులాంటి అతిపరిశుభ్రమైన మీయింట్లోకి
అడుగు పెట్టగానే
నలుమూలలనుంచీ వింత వింత పరిమళాలు చుట్టుముట్టేవి;
ఆవుపేడతో అలికిననేల,
పొయ్యిలో కాలుతున్న కండికంప,
పొయ్యి మీద కాగుతున్న 'పాలు',
ఉట్టిమీద నేతి ముంత,

గడ్డ కట్టిన 'గేదె పెరుగు',
ధాన్యంతో నిండిన దొంతి కుండలు.
ఎక్కడి నుండో గాలి మోసుకొని వస్తున్న
చెరకు గానుగల బెల్లం వాసనలు,
మీ పరిహాసాల చక్కలిగింతలతో నవ్వే
కన్నెపిల్లల సుందర వదనారవిందాలు—
అంతా కలిసి అచ్చంగా
జననాంతర సౌహృదాన్ని రేపే 'కాళిదాసు కవిత'లా ఉండేది;
'నవంవయః' అప్పుడు నానెత్తురు నిండా వుండేది;
మధ్యాహ్న భోజనంలోకి కమలమ్మగారు 'ఐణమ్మాంసమూ' వండేది;
('అబలాసు కోమలా' మాత్రం
మీ శుకసప్తతి కథలలో విని
ఆనందించే వాళ్లం!)
నాయుడుగారూ!
'కట్టా'వంశం మణి మీరు!
అట్టాంటి మీ మధురస్నేహం
'సంభవంతు మమ జన్మ జన్మని' ...!!

4

ఎప్పుడో కన్నుమూసిన కన్నకూతురు చిన్నపిల్ల,
అడవిలో ఎదురుపడ్డ అమాయకపు జింకపిల్ల.
మీలో వికసించిన బుద్ధమూర్తి!
వెంటనే అస్త్రసన్యాసం....
మళ్లీ జీవితంలో, తుపాకి ముట్ట లేదు,
వేట మాట తల పెట్టలేదు

* * *

కుల భేదాల కుక్క కాట్లకు బలి అవుతున్న
ఇప్పటి విశ్వవిద్యాలయోన్మాద కాణేలీ పుత్రులకు
అప్పటి 'బాలకృష్ణారెడ్డి'తో మీరు
చేసిన కృష్ణార్జున స్నేహం చెప్పు దెబ్బ!
అబ్బా! నాయుడుగారూ!

నిజంగా
ఎంతగొప్పవారు మీరు!!

5

నేను
'గుల్బర్గా' దుమ్ములో దొర్లుతూనో
'బెంగుళూరు' పూలపాన్పు మీద పొర్లుతూనో
ఉన్నప్పుడు—
మీరు
నాతో చెప్పకుండా
ఒక చిమ్మచీకటి అర్ధరాత్రి వేళ
సీసాలో బిగించిన దెయ్యం మీద స్వారీ చేస్తూ
చిత్తూరు రోడ్డు మీద
చిత్తుగా
మత్తుగా
శత్రువుతో ఊరేగుతూ
పాత చొక్కా విప్పుకుంటూ
కొత్త చొక్కా తొడుక్కుంటూ
నిశ్శబ్దంలోకి నిష్క్రమించారు....
కాలం మనమధ్య చైనాగోడలా లేచింది....
సూత్రధారుడు 'వీరయ్యే' ప్రధాన పాత్రధారుడై
నా చెవిలో భరత వాక్యం పాడాడు....

* * *

అప్పుడు
ఊరి బయట
నల్లగాజులు పగుల గొట్టుకొని
తెల్ల బట్ట మీంచి నడిచి వస్తున్న మీ వదినగారు....
ఇప్పుడు
ఆస్థానంలో
మీ అర్ధాంగి కమలమ్మగారు....
నా గాఢ స్మృతుల కళేబరం మీద
రాబందులా వాలింది కాలం!

6

'ముంగిలిపట్టు' గుండెల్లోంచి
బెంగుళూరు బస్సు
టెర్రరిస్టు తూటాలా దూసుకు పోతోంది....
చెరకు తోట జుట్టు విరబోసుకొని ఏడుస్తోంది....
వరి చేల తలలు నిమురుతూ గాలి ఓదారుస్తోంది ..
చింత చెట్ల కొమ్మలకి చుట్టుకొని కాలసర్పం పొంచి చూస్తోంది....
ఊరు అలాగే ఉంది,
పేరు అలాగే ఉంది,
చెట్టు అలాగే ఉంది,
గుట్ట అలాగే ఉంది,
మీరు మాత్రం లేరు!
నాలో
ఇంకా
'నేను' ఉన్నా
లేనట్టుగానే ఉంది నాయుడుగారూ!

7

బ్రతుకు తీపిని బహువిధాలుగా పరిచయం చేసిన మీరు
నా జీవన స్మృతిపథంలో చిరంజీవి!
సాహసంలో
సౌజన్యంలో
(పరోపకారంలో)
ప్రాణస్నేహంలో
పేకముక్కలో
విస్కీ కిక్కులో
రేసుగుర్రం నిక్కులో
'ముంగిలిపట్టు' చల్లని పైరగాలి వీవనలో
చంద్రగిరి దుర్గం కప్పుకున్న తెల్లని మబ్బుల దీవెనలో
తిరుపతి 'ఆదికేశవులు నగర్' ఐశ్వర్య హేలలో
తిరుమల మెట్ల నామాల దీపమాలలో

దేవుని వజ్ర కిరీటపు ధగధగలో
శుక్రవారం క్షీరాభిషేకపు నిగనిగలో
ఇంకా
మీ తెల్లటి నవ్వు
చూస్తూనే ఉన్నాను....
వీనుల విందుగా
పసందుగా
మీ చిత్తూరు మాండలికం
సేవిస్తూనే ఉన్నాను....
నా ప్రియమైన దొరస్వామి నాయుడుగారూ!
[మిత్రుడు, సతీర్థ్యుడు శ్రీ నరాల వీరయ్యకు అంకితం].

* * *

"ప్రవాహంలా ఉంటుంది మహాకావ్యం
ప్రభావంలో పడేసుకుంటుంది మహాకావ్యం
తనవైపు ఆలోచనల్ని లాక్కునే సూదంటురాయి
సాపుచేసి హృదయాలని నిగనిగలాడించే ఆకురాయి"

—ఆరుద్ర

# ఏ. ఆర్. విద్యార్థి

## ప్రేమలేఖ

క్షేమమా ?
ప్రియమైన ఓ గిరికుమారీ !
గుర్తున్నానా ?
అందాల నా అడవిరాణీ !

కవి కలానికందని
ఓ అపూర్వ కల్పనా
నయన నక్షత్రాలనుండి
తేజో జలపాతాలుదూకే
అపురూపమానవీ
నువ్వెప్పుడూ నా తలపుల్లోనే !

మా గుడారం ప్రక్కనే గింతే
సెలయేటిదరి కెప్పుడైనా వెళ్తున్నావా ?
నా కవితల తర్జుమాలు వింటున్నావా ?

మీ వాళ్ళింకా బియ్యంనుండిమదిర తీస్తున్నారా ?
మీ పెన్నారి అడవిలో 'ప్లం' పళ్ళు దొరుకుతున్నాయా ?
అందరినీ అడిగినట్లు చెప్పవూ ?

ఆ రోజు
ఆ సెల మేటి ఒడ్డున నువ్వు
నవ్విన ఒక నవ్వే గదూ ?
నిన్ను నాకు పరిచయం చేసింది !
అప్పుడు
ఆనందం పట్టలేక

కాలమే మూర్ఛపోలేదూ ?!
దిక్కులన్నీ మత్తులో ఊగిపోలేదూ !
విపినమంతా తబ్బిబ్బై
నభం కేసి గెంతలేదూ !
హిమపాతం చెట్టు చెట్టునూ కల్పి
వెండి పందిళ్ళల్లలేదూ ?
మబ్బులు మన చుట్టూ
సిగ్గు తెరలు దించలేదూ !
ప్రేమ తుఫానులో నువ్వు
నా చేయి పుచ్చుకుని
కొండ శిఖరానికి లాక్కెళ్ళి
"ఇక్కడ ప్రేమించుకొందాం రా !
యీ లాహిరిలో ధూపమై పోదాం
యీ చైతన్యంలో కల్సి పోదాం
యీ కొండల్లో నవ్వుల జలపాతమై
ఆ లోయల్లోకి దూకి పోదాం రా !" అంటూ
నన్నల్లుకు పోతుంటే ;
నిన్ను నా మైదానానికాహ్వానించాను
నా అర్ధాంగిగా ఒదిగి పొమ్మన్నాను.
(ఎంత అల్పంగా ప్రవర్తించాను....!)

అప్పుడు నువ్వు
ఒక్క ఉదుటున నానుండి విడివడి
"నా ప్రియాతి ప్రియనేస్తమా ! మన్నించు నన్ను.
అంగీకరించలేను నీ ప్రతిపాదన్ను
రాలేను నీ వెంట.
నా హృదయపు ప్రతిస్పందనా
నా గళంలోని ప్రతిరాగమూ
యీ వెండికొండలకే తెల్సు
యీ అడవి పందిళ్ళకే ఎరుక.
నేనూ నీకిచ్చే ప్రతి కానుకా
యీ మేఘాలయాల్లోనే సుమా !

యీ హిమక్ష్మాధరాల్లోనే సుమా !
ఇదేమిటీ అల్పపుకోర్కె నీలో!
నన్ను యీ మైదానాల్లోకి లాక్కెళ్తానంటావు ?
అక్కడేముందని ?

ఆ జనారణ్యాల్లో, ప్రగతి మరీచికల్లో
కృత్రిమ బాంధవ్యపు ముళ్ళ పొదల్లో
దోపిడీ పెత్తనం చేసే పైశాచిక రాజ్యంలో
యీ పవిత్ర ప్రేమనెట్లా ఆవిష్కరించుకోగలం ?
ఆనందాన్నెలా పంచుకోగలం ?
యీ తులసిని ఆ తుమ్మల్లో ఎట్లానాటగలం ?
ఆ స్వార్థ జీవుల్లో నేనిముడలేను ప్రియా !

అయినా ప్రేమకు
కల్సి ఉండడమే ప్రధానమా ?
పెళ్ళే దాని సింబలా ?
కుటుంబ వ్యాపారమే పరమావధా ?

పెళ్ళి పంజరంలో మనల్ని మనం బంధించుకొని
వ్యసనాల్ని చల్లార్చుకోవడానికో
అలసట తీర్చుకోవడానికో
ఒకర్నొకరం వాడుకొంటూ
ప్రేమను రోజువారి అలవాటు స్థాయికి దించుకొని
ఎండిపోతూ పంజరాల్లోని చిలుకల్లా
ఆవులిస్తూ 'జూ'లోని సింహాల్లా
మృత్తిక పిలుపుకోసం నిరీక్షించడమేనా" అని
నన్ను నిలదీశావు.

నిజమే
నువ్వన్నది నిజమే
నిజమే, నిజమే నువ్వన్నది !

ఆ ఆకాశవు నీలిగుడారాలూ,
పచ్చికనేల తివాచీలూ
కొండలూ, లోయలూ, సెలయేళ్ళూ
అడవులూ, పూలగుత్తులూ, తుమ్మెద గుంపులూ, ఆ సీతాకోక చిలుకల
మందలూ

నభ ఖగాలూ
పెళ్ళి గుంపులా నడచి వెళ్ళే
మబ్బుల ఐరావతాలూ
నీలి బంగారు సూర్యోదయాలూ,
అరుణారుణ సంధ్యాకాశాలూ
అమాయకాన్ని పరిమళించే నీ జాతి జనులూ
అన్నీ నీవి
అంతా నీ వాళ్ళు.

ఆ పవిత్ర ధరిత్రినుండి
విడదీయలేని లతానికుంజానివి
ఆ సుందర సరస్సునుండి
త్రెంచ లేని సరోజానివి.

నిన్ను ప్రేమించాను
అందుకే దురాశ పడలేదు.
మాయమాటలు చెప్పలేదు.
నిన్ను నీకే వదలివచ్చాను
నీకు ప్రియమైన హిమగిరులకే వదలివచ్చాను.
నీ ఆ స్వేచ్ఛాంబుదాలకే వదలి వచ్చాను.

క్షేమమా ?
ప్రియమైన గిరికుమారీ !
గుర్తున్నానా ?
అందాల నా అడవిరాణీ !

# అనుముల కృష్ణమూర్తి

## హిమాచలరవిచంద్రిక

చెట్టంత మనిషీ !
చూడు !
పుడమినుండి నింగెత్తు పెరిగిన
మహాద్యక్షోర్ధ్వ బాహువు !
సూర్య చంద్ర నక్షత్రాలతో
సంప్రదించే ఆ
పెద్దమనిషి వాలకం
చూడు.
ఇలకూ గగన తలానికీ అంటే
నిగనిగలాడే
ఆ హిమస్వచ్ఛ నిష్కళంక శిఖరం
చూడు.
గొప్ప దృఢత్వంగల మంచు కొండని
చూడు.
మన ఈ నేలనుండి
దేవతల ఆ నింగి దాక
దొంతర దొంతరలై పేరుకున్న
కోట్లాది కఠిన హిమ ఖండాల్ని
చూడు.
అందులో కొన్ని జారుతున్నవి, ఆకర్షణే
నిజమని భావించే వాడు
రోజు రోజుకూ నైతికంగా దిగజారినట్టు–
ఐవా
ఒకానొక అమృతపు జల్లు మనస్సంతా
ఆవరించినట్టు ఆ
గుట్టలో ఏ కరుణామయ స్త్రీత్వమో
దాగియున్నది సుమీ !

జారే జబ్బలూ—నీరసించిన కళ్ళూ ప్రేలి
పోయిన చెక్కిళ్ళూ అందంగానే ఉన్నట్టు
ఆ శిఖరానికెంత విశాలమైన
అందాన్నిస్తున్నవో ?
నీలాకాశపు ఆకర్షణకు తాళలేక
రెక్కల్ని మనసారవిప్పి ఎగిరే
పిట్టలు
ఆ గుట్టపేరు చెపితే నీళ్ళు త్రాగవు
అతడు హిమవంతుడట దేవతాత్మయట !
కోట్ల శరత్తులు సాగర గర్భంలో
శృంగార యాత్ర చేసి చేసి
మోహన విహారంకోసం వచ్చేడట మన భూమికి.
ఉదయారుణ రమణీయమైన ఆ
నిష్కళంక హిమస్వచ్ఛ శిఖరం ఉందే
ఏ మహాకాముడి కలో ఫలించినట్టుంది కదూ !
ఆ లోయల్లో
మనిషినే కాదు జంతువునీ పరవశం చేసే
పుట్లకొలది సోయగమూ
అంతకంటె రెట్టింపు నాజూకు తనమూ ఉంది కదూ !
అందుకే మనం ప్రేమిస్తాం మన ఈ కొండనీ,
భూమినీ దాని విశాల పరిసరాల్నీ
ఏ మంచి సంప్రదాయమో
అనూచానంగా తెచ్చే
తృప్తినీ ఆనందాన్నీ అనుభవిస్తాం కదూ !
ఆ నిశ్చల నిర్మల నిర్లిప్త వాతావరణంలో
మనః పరిధి సమస్తమూ స్విన్నమైన ఆ వేళ
స్వచ్ఛతా ధవళిమా మన చుట్టూ వ్యాపిస్తున్నప్పుడు
ఆ పర్వతం ఒక చిన్న గాడ్పును పిలిచి
ఒక కోమల రాగాన్ని అలవాటు
ప్రకారం మన మీదికి పంపినప్పుడు
ఎలా ఉంటుంది మనస్సు ?
ఐనా

మునుముందావరిస్తుంది భయానక తమస్సు.
ఆ బీభత్స తమో జాడ్యంలో
గత్యంతరంలేక వికసించిన పూలు తల
లూపేందుకు తటపటాయిస్తూన్నప్పుడు
కలుపుగోలు తనానికి కళ్ళెంబడ్డప్పుడు
ఒక పైశాచిక వాతావరణం
జుట్టంతా విరబూసుకొని
నోరంతా తెరచి
అమాంతం మీదికి వస్తూన్నప్పుడు—ఒకే ధ్యాస
మనస్సంతా ఒకే ధ్యాస,
ఈ హిమ పురుష సత్త్వంలో
ఎంత సెగ దాగిందో అని
ఈ లలితలలితంగా వీచే మారుతాల్లో
ఎన్ని ఝంఝలు దాగున్నవో అని
బోనులోని విడివడని బెబ్బులిలా
ప్రాణమున్న భయంలా
గుహలో దాగిన సివంగిలా
పై బడనున్న మృత్యువులా-
నడుస్తూన్న మృత్యువులా—ఉంటే
మనస్సులో దిగులూరుతుంది.
పిరికితనం కౌగిలించినట్లుంటుంది.
అప్పుడు—
ఆ వాతావరణంలో
ఆ పరిసరాల్లో ఒక్కసారి
ఆ నిష్కళంక హిమ శిఖరం చూడు.
అరుణరాగ రంజిత నవజీవన మకుటాన్ని చూడు
అవిరులూరే అన్నపురాశివలె లేదూ !
ఆ హిమగర్భంనుండి అనంత
సంఖ్యలో రవ్వల మువ్వలు ధ్వనిస్తవి
మృదు సుగంధం లాంటిదేదో
చల్లగ ఆవరిస్తుంది.
ఓః

ఆ హిమమహాసత్త్వం చుట్టూ కోమలమైన వెలుతురు-వెన్నెల.
అడవిలో కాయవచ్చిన వెన్నెల.
ఇంతటి సర్వాంగ సౌందర్యాన్ని పులిమింది.
కన్నులున్న వాని మనస్సులో
ఒక హిమసుఖం బాణం దిగబడ్డట్టుంటుంది.
ఓ మనిషీ !
నీవిప్పుడు కావు దారెరుగని పాంథుడవు
నీ ముందున్న భయంకరసత్త్వం
మునుపటిలా
ప్రాణంలేని హిమఖండం కాదు–వట్టి శిలా కాదు
ఇప్పుడది మహా ప్రశాంతపద్మం
వేల దీధితుల్తో వికసించే
వెల లేని మహా వజ్రం.
ఓ మనిషీ! నీ
విపుడు చూడు నీ పీడకల విరిగింది.
అడ్డువచ్చిన తెర తొలగింది.
మూసుకున్న ఆశామందిర ద్వారం విప్పుకుంది.
నీ మనః పరిధి విశాల విశాల మౌతున్నది
ఆవిర్లెగజిమ్మే ఆ ఇష్టాన్నపు రాశిలోనుండి
ఆ రవ్వల మువ్వల సవ్వడిలోనుండి
నీ కొరకై వినిపిస్తూన్నది ఎంతో కమ్మని సన్నని గీతం
అమ్మ పిలుపులోని సంగీతం
ఆ మోహన గీతానికి
స్నేహపురాగం కట్టింది.

* * *

"ప్రేమయనగా చూచుటగాదు, పలుకుట గాదు,
విహ్వల చిత్తముతో వాపోవుట గాదు !
ప్రేమయనగా మంత్రము గాదు, తంత్రము గాదు,
ఆత్మ నిర్వాణముచే ఆరాధించుటయే" —శిష్ట్లా

## జయధీర్ తిరుమలరావు

### ఆయుధం వాణిజ్యమైన వేళ

సింధు జలశాఖ నుదుటి మీద అగ్ని పర్వతం పేలింది
ఇరాన్ ఇరాక్ నిర్జీవ సమాధుల మీద
లాభాల పిందెల కోసం పరుగుపోటీలు
కాలిన చమురు బావులూ, కర్మాగారాల
కమురు కంపు మేఘాసవాల మీద
అగ్రరాజ్యాల విశ్వశాంతి శిఖరాగ్ర చర్చలు
రెండు దేశాల శవ వాకిళ్ళ మధ్య
ఒక్క క్షణం
రెండు టోపీలు తలదిగుతాయి విచార సూచకంగా

తాము వాడకున్నా
తమ మీటల నీడలు అలంకరించుకున్న
అమ్ముడు పోయిన విశ్వాస పాత్రమైన ఆయుధాలు
చర్చిల్లో, మసీదుల్లో
ఎడారుల్లో, సముద్రాల్లో
అడవుల్లో, వనాల్లో శవ పుష్పాలు చేసి అలంకరిస్తుంటే
వాలుగు పెదాలు తృప్తిగా వెలుగుతాయి.

అగ్ర రాజ్యాల్లాగే ఆయుధాలూ ముసిముసిగా నవ్వుతాయి
పసిదేశాల ఎడిలో రాబందులై వాలుతాయి
జడకు భారమైన పూవుల్లా
బడుగు దేశాల శిరస్సుమీద బలిపాదమై నిలుస్తాయి

ఇవ్వాళ లాభానికి మరోపేరు
ఆయుధం
ఇవ్వాళ కుంభకోణానికి మారుపేరు
ఆయుధం

ప్రపంచాన్ని చుట్టుముట్టిన మారణరాగం పేరు
అణ్వాయుధ పోటీ
ఆయుధం
ఆయుధాన్ని ఉత్పత్తి చేస్తుంది
హంతక క్రియను బాంబులు, అస్త్ర ఆయుధాలు సలుపుతుంటే
ఆయుధం ఉచ్చులో ఇరుక్కున్న ప్రతివాడూ
కలాన్ని ద్వేషిస్తాడు
అక్షరాల్ని అణుయుద్ధ నౌకలనుకుంటాడు
శబ్దంమీద యుద్ధం ప్రకటిస్తాడు
ఐనా
పెదాల విత్తనం చీల్చుకుని మాటరూపంలో
కలం మొలకెత్తుతుంది.

* * *

"మనసులోని వేనవేల రేఖలలో చాయలలో
మెలమెల్లగ చెదరివున్న అర్థాలను చేర్చాను.
చివరికి ఒక స్ఫురణతోడ, ఒక దండగ కూర్చాను.
అర్థమొక మెరుపు, భావం శ్వేత నీల కాంతిధార
నేటికి విచ్చినది ఎలాగో నా జన్మాంధకారం
నేనిక వెదుకను, నాకిది కడపటి స్ఫురణలో కాంతి,
జీవితపు చరమసీమలో ప్రసవించిన ప్రశాంతి." —బైరాగి

# ఎండ్లూరి సుధాకర్

## జ్ఞాపకాల కన్నీటిబొట్లు

ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు మిత్రులు
ఖుదా హాఫీజ్ సయోనార అంటూ
శూన్యం మిగిల్చిన ముళ్ళ కంపల మధ్య
నన్నొక రెక్కలు తెగిన పక్షిని చేసి
అజ్ఞాత ప్రవాసులై
ఆత్మీయులు మహాభినిష్క్రమణం చేస్తున్నారు
ఎన్నడూ కలవని వాళ్ళు
ఎప్పుడూ కలిసేవాళ్ళు
గుండె టేప్ రికార్డర్లో.
క్యాసెట్లై కూచున్న వాళ్ళు
కళ్ళల్లో కన్నీటికెరటాలై కదిలేవాళ్ళు
మనసు మైదానంపై ఆరుద్ర పుర్వులై నడిచిన వాళ్ళు
నా వేళ్ళని చినుకుల్లా స్పృశించిన వాళ్ళు
మనసు మెడచుట్టూ చేతులుంచి
లాలనగా హసించిన వాళ్ళు
ఇరానీ హొటల్ అదా బాయిలో
ఆత్మీయత పంచుకున్న వాళ్ళు
పాతపద్యం లాంటి సైకిల్ క్యారియర్ పై ప్రాసలా కూర్చున్న వాళ్ళు
ఇప్పుడు మృత్యులోయలోకి జారిపోయారు
అగ్ని గుండంలో నిలువునా దగ్ధమయ్యారు
అచూకీ లేని అడివి జాతరలో
పసిపిల్లల్లా మాయమయ్యారు
కడపటి సలాములు కూడా అందుకోకుండా
చల్లగా బావు బాపలెక్కి ఫ్లైయింగ్ సాసర్లై ఎగిరి పొయ్యారు
నాతో కరచాలనం చెయ్యకుండానే
నెత్తుటి గులాబీలై నలిగి పొయ్యారు

మిత్రులారా
మీ స్మృతులు నన్ను విచలితుణ్ణి చేస్తుంటాయి
మధ్య రాత్రులు
మీ కంటిపాపలు నన్ను విహ్వలుణ్ణి చేస్తుంటాయి
మృత్యువు సమస్యల సుడిగుండమై కబళించిన క్షణాల్లో
మీ సజీవ దృశ్యాలెప్పుడూ
తొలిపొద్దులా కొత్తగా వుంటాయి
మీ స్మృతుల సమాధుల చుట్టూ
జ్ఞాపకాలు కన్నీటి బొట్లై చెట్లై
హరితాశ్రువులు రాలుస్తుంటాయి
ఒక పునరుత్థానం కోసం పరితపిస్తుంటాయి.

* * *

"....కారడవులలో లయాతీతమై
విరుతించిన నానా జంతు ధ్వనులలో
నక్షత్రాంతర్నిబిడ నిఖిలగానం,
భూకంపాలు, ప్రభుత్వ పతనాలు,
విప్లవం, యుద్ధం
అన్నీ నీ చైతన్యం!
నీ విశ్వరూప సాక్షాత్కారం!" —శ్రీశ్రీ

# పెన్నాశిరాకృ

## ప్రశ్నార్థకం

చినవీరభద్రుడూ ! చినవీరభద్రుడూ
అలల రెప్పల కింద పాద ముద్రల్లో సింహగర్జనలు వింటూ
నక్షత్రాల వేళ్ళకొసలకు చెక్కిళ్ళు రాసుకుంటూ
మల్లెమొగ్గల పసిపిడికిళ్ళ పరిమళాలనాఘ్రాణిస్తూ
నిశ్చల యాత్రలో నిర్గమ్య గమనంలో
ఇలాగే.... ఇలాగే....
వర్షధారల మీద తంత్రుల మీద తెగిపడుతున్న
    నక్షత్రాల ధ్వనులు కలత పెడుతున్నాయి కదూ !
సూర్యుడు పదపీఠమై హిమవన్నగాలన్నీ
    హిమకలశాలైన దృశ్యాలు
వ్యథ పెడుతున్నాయి కదూ !
శత్రువెవరో తెలియని స్థితిలో ఆత్మహనన
    దృశ్యాల్ని చూస్తున్నాం కదూ !
చినవీరభద్రుడూ ! చినవీరభద్రుడూ !
అనాచ్ఛాదిత హిమతల్పం మీద జ్యోత్స్నా వల్లరి
    అగ్ని జిహ్వలుగా మారుతున్నదిగదా !
కరవాలనాల కాలసర్ప విన్యాసాలలో
రాబోయే ఉదయాలన్నీ పరిచిత ముఖాలమీద
    అపరిచిత గాయాలే కదా !
ఒక మహా జలావరణం మధ్య శీతల భస్మరాశి మీద
నిలుచున్నట్లు లేదూ !
స్వప్నానికి స్వప్నానికి మధ్య ఎన్ని నక్షత్ర
మండలాలున్నాయో ఎలా తెలుస్తుంది
మనం శాశ్వత బోయీలమైన పల్లకిలో రాజకుమార్తె
    ప్రశ్నార్థకమే కదూ !
చినవీరభద్రుడూ ! చినవీరభద్రుడూ !
ఆదిమగృహరుజాగ్రస్తతనుంచి ఎవరు మాత్రం
ఎలా తప్పించుకోగలరు చెప్పు.

# శేషేంద్ర

"...............................†"

గదిలోకి వచ్చి ఎగిరే గిటారు
ఆ దేశ ద్రిమ్మరి భ్రమరం
బయట నుల్చో ఉన్న భయానక ఎండ
గాలిని బంధించిన గూండా
పసుపులో వ్రేళ్ళుముంచి నుల్చో ఉన్న
మౌన వృక్షమే
మనిషీ రాగమూ అనుభవించే
నిశ్శబ్దంలో ప్రవహిస్తున్న కాలం
రెక్కలు జాపి వాయువుల్లో
నిశ్చలత్వం సాధిస్తున్న పక్షి
మూడూ తొమ్మిదీ మీద చేతులు జాపి
ఆకాశంలో ఉన్న గోడ గడియారం!

---

† ప్రముఖ కవి గుంటూరు శేషేంద్ర శర్మగారు 1989 మే, జూన్ మాసాలలో గ్రీసు దేశంలో పర్యటించారు. 27-5-89న ఏథన్సు నగరం నుండి మాకు వ్రాసిన లేఖలో ఒక శీర్షికలేని కవిత వ్రాసి పంపారు. దీనిని ఇక్కడ ఇస్తున్నాము (సంపాదకులు)

# పాల్పూరి వెంకటకృష్ణారెడ్డి

## జీవన తరంగం

సముద్ర తీరంలో తిష్ఠవేసి
చూపుల వల విసిరాను
ఆశల చేపల కోసం
తరంగాల భక్తులు
నురుగుల పూలకావిళ్లతో
చిందులు త్రొక్కుతూ వస్తున్నారు
బ్రతుకు తిరుత్తణికి.
సమస్యల హెూరు
కష్టాల గులకరాళ్లు
నిరాశల ఇసుక
అప్పుడప్పుడు అల్పసంతోషాల
నత్తగుల్లల సంగీతం!
అనంతమైన ఈ జలరాశి ఆగ్రహిస్తే
బడబాగ్ని బయటపడి
ఉప్పెన కెరటాల నాల్కలతో
ఊళ్లను దహిస్తుంది!
మనిషిగర్వం మట్టి కరుస్తుంది!
జీవకళ ఉట్టిపడే నాడు
క్షణంలో శవాల బీడు!
మీది మీదికి వస్తున్న ఒక్కొక్క తరంగం
మానవ భావిని శాసించే ద్యూత తురంగం!

# శికాకొల్లు లక్ష్మి

## వేణీ సంహారం

కౌరవ సభ అయినా, అది
'కజగం' సభ అయినా
స్త్రీని పరాభవించిన జాతి—
గుండె పగిలి నెత్తురు చిమ్ముతుంది
వేణీ సంహారానికి తైలం అమ్ముతుంది
దాని పచ్చని వంశంలో శ్మశానం క్రమ్ముతుంది !

## మంత్ర దండం

జీవితం రంగుల కల
అర్థం కాని చిక్కుల వల
మెట్టు మెట్టుగా పైకి ఎక్కవలసిన
మోకాళ్ల పర్వత ప్రయాణం
క్షణక్షణంగండం
మనిషిని మనీషిగా మహర్షిగా
మహాత్మునిగా మార్చే మంత్ర దండం !

## అద్దాల మేడ

కులం మతం జాతి భాష పార్టీ
ఉత్తరాది దక్షిణాది
ఈ అద్దాల మహల్‌లో ఎన్ని అడ్డుగోడలు ?
ఎన్ని ముళ్ల కంచెలు ? హద్దులు ? సరిహద్దులు ?
కాని, ఒక అడ్డుగోడ కట్టేముందు ఆలోచించు
ఈ భవనం క్రింద ఎన్ని బలిదానాల పునాదులున్నాయో !
ఒక రాయి చేత పట్టేముందు గుర్తించు
నువ్వున్నది కూడా ఒక అద్దాల మేడే అని !!

# తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి

## చిదంబరం

ప్చ్ !
చిన్నప్పటి నాన్న ముఖం.
ఒంటిని కాసేపు అంటి పెట్టుకునే
వేడి నీటి వెచ్చదనం,
వెన్ను మీద వెచ్చని చేతిలా.
కొండ మీద ఒంటరి దేవాలయం—
నీడ నా మీద పడందే !
ఇరుకు సందుల అల్లిక లోంచి
దారపు కండెలా నన్ను పరిగెట్టించిన ఇనుప గాను ;
పగిలిన మోకాల్చిప్ప !
విప్పారిన ఆమె కళ్లలో
వెదకాలనిపించే నీలపు లోతులు,
ఇంతలో
మెదడులో, మనసులో రైలు చక్రా లొదిలిన రొదలు ;
శరీరం మీద చక్రాల వచ్చ బొట్లు.
రేవుల్లో నావ ఒదిలిన జాడలు చూస్తూ
నడి ఒడ్డున ఒంటరి నేను.
ప్రాభాత సౌందర్య కాంతిలో,
విషాద సాంధ్య రాగంలో,
రంగు రంగుల సర్ప పరిష్వంగంలో—
కళ్లు మూసినా
ఎన్నెన్నో. ఏవేవో
కనీ కనిపించక
విసురుగాలికి కలిసి
వెంటనే విడిపోయే ధూమ దృశ్యాలు.
మళ్లీ ఖాళీ ఆకాశం !
కళ్లు తీసి—తెల్లగుడ్డకి అతికిస్తే ?

# కొండేపూడి నిర్మల

## ఎదురు చూపు

పరిమిత దృశ్యానికి బందీ అయిన కంటిచూపు
ఎదురు చూపుల ఆకాశంలో మబ్బులా తేలుతుంది
చూపు వాల్చుకోవచ్చు
చత్వారం రావచ్చు
ఎదురుచూపు అలసిపోదు
గంగ కట్ట పొడవంతా ఆ చీమ యాత్రిస్తూనే వుంటుంది.
రావని తెలిసిన నీ కోసం
ఉత్తరం ముగించక ముందే జవాబుకోసం
తెల్లవారితే రాత్రవటం కోసం
రాత్రయింది లగాయితూ తెల్లవారడంకోసం
రెంటి నడుమా మగత నిద్రల మిథ్యా భ్రమలకోసం
ఎదురు చూపెదురు చూపు-
దాహం వేస్తే గ్లాసెడు ఎదురు చూపందుకుంటాను
రైల్వే ప్లాట్ ఫారమ్మీద వెయిట్ చూసే మిషను
నన్ను తూచడం మానేసి
అది ఎన్ని కిలోల ఎదురుచూపో చెబుతుంది
ఉగాది ఉగాదికీ కొత్తచీర కట్టుకున్న ఎదురు చూపు
కిటకిటలాడే ఆడిటోరియం హాల్లోనూ
రెప్పల చప్పుడు రికార్డు చేసే
ఒంటి స్తంభం గదిలోనూ
ముఖ కవళికల్లో మార్పు లేదు-మాస్క్ లేదు
లౌకిక విజయాలు వైఫల్యాలూ గట్రా
ఏవో సంఘటనల సమూహాల్లా
స్పర్శ మాత్రంగానే తొలగి పోతుంటాయి.
ఒక్కో సారసలు ఏ కారణమూ లోచదు
ఎందుకని ప్రశ్నించే ముందే

ఏం లేదని చెప్పే జవాబులా వుంటుంది
గుడ్డిగా నడుచుకుంటూ చాలాదూరం వచ్చేసిన చోట
మరోవైపు దారి చూపిస్తున్న శిలావిగ్రహం చెయ్యిలా వుంటుంది
ఫలితంతో ప్రమేయం లేకుండా
అలవాటు కొసన జారిపోతూ వుంటుంది
మనిషనే వాడసలు బొడ్డు తాడుతో కాదు
ఎదురు చూపుతో పుట్టాడనిపిస్తుంది
నీ పెన్ను చివర పట్టుకున్న
చూపుడువేలూ బొటనవేలూ కలిస్తే-
పుల్లను నోట కరుచుకుని పడిపోయిన అనవాలు
వెతుకుతున్న
పక్షి ముక్కులా వుంటుంది.

* * *

"రాత్రి
తోట ధరించిన ధ్యానముద్ర
తోట
రాత్రి కంటున్న కల—
నీలి రాత్రి నక్షత్రాల క్రింద
నిద్రావస్థలో ఉన్న తోట
ఒక ప్రతీకల మహా నాగరకత" —శేషేంద్ర

# సోమసుందర్

## ప్రభాత మంత్రం

అలనాడు చికాగోలో పేలిన తుపాకిగుండు
చెప్పిన జగద్రహస్యం తిరుగుబాటు
ఈ శతాబ్దం గుండెల్లో
మ్రోగిన నవీన శబ్దం తిరుగుబాటు
ప్రపంచం చెవులలో
కోడై కోసిన ప్రభాత మంత్రం తిరుగుబాటు !
ఇప్పటికీ వినిపించుకోకుండా
నిద్రపోతున్న నిర్భాగ్యులారా లేవండి !
నిద్ర నటిస్తున్న సోమరులారా
క్షమించదు మిమ్మల్ని కాలం-కరవాలం....
ఆగామి శతాబ్దంలో నైనా
ఆకలిని నిషేధిద్దాం రండి...
కృతక దారిద్ర్యాన్నీ, అధికార దాహాన్నీ
తరిమేద్దాం రండి....
మందిని కొల్లగొట్టి కొవ్వెక్కే మనిషి స్వార్థాన్ని
ఆగామి శతాబ్దంలో నైనా
ఉరితీద్దాం రండి !
మందాకినీ గోదావరీ
కృష్ణవేణీ కావేరీ
ఓ సమస్త నదీమతల్లులారా వినండి—
నా జాతి జనుల నరాలకు
జల వేగాలందించండి ;
స్తబ్ధత పోకార్చండి, నేడే ఉరకండి ...
తరంగలాస్యం చేకూర్చండి !
ఆగామి శతాబ్దంలో నైనా
ఆఖరి మనిషి దాకా

ఆకలినీ కన్నీళ్ళనీ కడగండ్లనీ
తొలగింపకొనే
జవసత్త్వాల జలశక్తి నందించండి!

జోస్యాలూ జాప్యాలూ ఇక్కడే పాతేసి
తత్త్వసారాలూ తాత్సారాలూ ఇప్పుడే మంట పెట్టి
ఈ నిశాంత సమయంలో—
గులాబి పొదపై వాలిన బుల్ బుల్
వినిపిస్తున్న ఆహ్వాన గీతం సాక్షిగా
ఆహ్లాదానికి సుప్రభాతం పలుకుదాం రండి....

దారి పొడుగునా నారింజ పూలు పూసిన
మరో ఉదయం స్వాగతిస్తుంది;
పరిమళించే నారింజ పూలు మోసగించవు
సువాసనల కోసం చేరిన
సర్పాలే రెండు నాల్కల వంచకులు!
చెట్లు అబద్ధ మాడవు
చెట్ల నీడను బ్రతికే మనిషే
అబద్ధాల పుట్ట!

అగామి శతాబ్దపు నవ్య విభాతంలో
పొన్న చెట్టు కొమ్మల క్రీనీడలలో
దొంగ చీరలు ససేమిరా వ్రేలాడవు
పరసతుల మానాలతో
దేవుడైనా సరే-పరిహాసాలాడ లేడు!
తాళి ఎన్నడూ ఎగతాళిగా మారబోదు
రండి-ఈ పాత ఇంటి తలుపులు
నేడే తెరవండి....

డెక్కలు మొలిచిన కాలాన్ని ఇక్కడే బంధిద్దాం....
రెక్కలు పెరిగిన కాలాన్ని ఇక్కడే ఎగరేద్దాం....

## జె. బాపురెడ్డి

### చిరంజీవి స్వార్థం

సహస్ర ముఖాలతో
స్వార్థం విజృంభిస్తున్నది
కవితా వస్తువు కోసం వెదికే
నా కలానికి
అడుగడుగున ఎదురొస్తున్నది–

'సమాజాన్ని నడిపే
శక్తుల గురించి
సమాలోచిస్తున్న ఓ కవీ!
అన్ని శక్తులను నడిపించే
ఆదిశక్తిని నేనే నయ్యా'
అంటూ, అర్థాంతరన్యాసంతో
ఆత్మస్తుతి చేసుకొంటున్నది.

ఔను!

సర్వాంతర్యామి స్వార్థం
సర్వకళాకోవిద స్వార్థం
సర్వార్థ సముపార్జని స్వార్థం
కామరూపిణి స్వార్థం
కళ్లున్నా లేకున్నా కనిపించే
యదార్థం స్వార్థం
నా కవితా వస్తువై కూర్చుంది-
వాణియైనా
ఆకాశవాణియైనా
రేణువైనా, కరేణువైనా
తప్పించుకోలేని
చిత్రాతివిచిత్ర వ్యూహం

చిరంజీవి స్వార్థం—
మనిషిలోని దైవాంశాలను
మాలగా మార్చుతుంటే
చిటుక్కున దారాన్ని కొరికేసే
చిట్టెలుక స్వార్థం

సమతా దీపాల పాలిటి
సుడిగాలి స్వార్థం
శాంతి గీతాల పాలిటి
అపశ్రుతి స్వార్థం—
సామ్యవాద సాహిత్యాన్ని
సమయోచితంగా వ్యాఖ్యానించి
సకల జనాదరణ పొందే
సవ్యసాచి స్వార్థం
ఏపార్టీ ఏదైనా
మెజార్టీ తనదేనని
ఎన్నికలు ఎన్ని జరిగినా
ఎవరూ తన నోడించ లేరని
సవినయంగా చాటుకునే
స్వార్థత్యాగి స్వార్థం—

దేవుణ్ణీ దేశభక్తిని
దివ్యంగా కొనేస్తున్న
ధీశాలి స్వార్థం
నన్ను నీవు జయించ లేవంటే
నవ్వేస్తుంది స్వార్థం.

# చొక్కర తాతారావు

## ఆలోచనలపర్వాలు

విశ్వమంత వ్యాపించిన శూన్యం
ఒక్క రోజయినా నీలో గూడు కట్టుకుంటుంది.
నీలో శూన్య భావాల్ని
పటాపంచలు చేస్తుంది.
పరుగులెత్తే నీ కోర్కెల అశ్వానికి
ఏదో ఒకరోజు కళ్ళెం వేస్తుంది.
ఒంటరి చీకటి రాత్రిలో
వెంబడించే ఆలోచనల పర్వాలు
ఎంత వదిలించుకుందామన్న
నిన్ను వీడిపోలేమని మారాం చేస్తుంటై.
నీ ఎదలోయల్లో వర్షించే భావాల విత్తనాలు
మొలకెత్తి చిగిర్చి ఆశయాల పుష్పాలు పూస్తై.
నేలమీద నాట్యం చేసే నీడల అలలు
ఉన్నట్టుండి నీ పైకి ఉవ్వెత్తున లేస్తై.
నీవు పాడే పాట చిక్కదనం నుండి
క్రమేపీ పల్చబడి పోతుంది.
గుండెనిండా నువ్వు పీల్చేగాలి
అకస్మాత్తుగ ఆగిపోతుంది.
ఎటుపోవాలో ఏం చేయాలో
తెలియని అయోమయంలో పడతావు
ఎక్కడినుండో వీస్తూ వస్తున్నగాలి
నిన్ను కమ్ముకుంటుంది.
కొత్త లోకాలకు తీసుకెడుతుంది.
కను సైగతో నిన్ను అణువును చేసి
అవతల పారేస్తుంది.

## మధుసూదనరావు

### ఫోటోలు మిగుల్తాయి....

మౌనం కనురెప్పల మీద
బరువైన రాత్రి
క్షణాల కాళ్ళకింద నలుగుతున్నప్పుడు....
నిశ్చలంగా కూలుతున్న వెలుగుగోడల్లో
నిన్నటి చీకటి అలలు అలలుగా కదుల్తున్నప్పుడు....
ఛిద్రమైన ఉషః స్వప్నంలో
జ్ఞాపకాలు ఆకులు రాలుతున్న అరణ్యాలౌతున్నప్పుడు....
అలుముకున్న ఆసుపత్రి వాసనలో
రాలుతున్న ఆకు చెక్కిలి నిమిరిన స్పర్శ
వెన్నుపూస వెంట పరుగెట్టినపుడు....
వెన్నంటి ఉండే ఆశయాల అనుభూతి
గుండెను నిరంతరం తొలుస్తున్నపుడు....
పంపకాలు జరిగిన ఆప్యాయతలగోడపై
ఫ్రేములోని ఫోటోలు ప్రశ్నార్థకమై
మిగిలిపోతాయి !

# సుమనశ్రీ

## గ్రీష్మంతో ప్రణయావేశం

ఎండమావులు నా వెంట నడుస్తున్నాయి. ఒక వేయి జలపాతాల్ని మోస్తూ పర్వతాలు సన్నాహ్వానిస్తున్నాయి తమ చెట్ల నీడల్లోకి—

వంటి నిండామట్టి స్నానాలు చేస్తున్న ఏనుగుల సమూహాల్లా చెట్ల తొండాల్ని ఊపుతూ మాపై పువ్వుల వర్షాన్ని కురిపిస్తున్నాయి. నీడలు నిరీక్షిస్తున్నాయి మమ్మల్ని ప్రేమగా కౌగిలింమకోవాలని. ఆకలిగా ఆరగించండంటూ పండ్లు విడిది అహ్వానాలు పంపిస్తున్నాయి పుప్పొళ్ళతో నిండిన గాలితో.

ఎండిపోయిన చెట్లు కొన్ని నీళ్ళకోసం వెతుక్కుంటున్నాయి. భూమిని పదే పదే తమ లోతైన వేళ్ళతో తవ్వుతూ పచ్చదనాన్ని కోల్పోతున్నామని నిలువునా కంపించి పోతున్నాయి. ప్రాణాల్ని పాతాళంలోంచి ఎగబీల్చుకుంటూ ఒక నవ్వు మొహాన్ని నావైపు విసిరేస్తోంది నీలి గులాబీ. అప్పుడే మొలిచిన ఆకును అడ్డేసుకుంటూ కన్నీటిని నానుంచి దాచుకుంటోంది.

రాళ్ళు బద్దలై రజత మూర్తు లౌతున్నాయి.

తమని తామే కోపోద్రిక్త శిల్పాలుగా చెక్కుకుంటున్నాయి.

కొప్పుల్లోంచి ఎగిరొస్తున్న పూలకి లాగే కోట గోడల్లోంచి ఊడిపడుతున్నాయి.

* * *

చెప్పుల్లేని పాదాల్తో ఎండలో నడుస్తున్నప్పుడు నిప్పుముళ్ళు గుచ్చుకుంటాయి. ఇసకలో ఇనుము కాలినట్లు పాదాలు బొబ్బలెక్కి పోతాయి.

కొబ్బరి బోండం తీపి నీళ్ళ రుచిలో నువ్వు సేదతీరేలోగా వడగాడ్పు నిన్నెగరేసుకు పోతుంది అగ్నిపర్వతాల మీదికి—

తపస్సు చేస్తున్నట్లు తలక్రిందులుగా వ్రేళ్ళాడుతున్న 'కోతి' పండు నిప్పుగాలి తాకిడికి నేల రాలి పోయింది.

ఊపిరాడని ఉలిపిరి కాగితం గాల్లో ప్రణయ ప్రయాణాలు చేస్తోంది. ఎండా కాలాన్ని మించిన నరకం మరెక్కడుందో నీకు తెలుసా ?

* * *

సంపెంగ పూలకోసం చేతులు బాస్తోంది నా ప్రేయసి. ఒక్క గంతులో కొమ్మ నందుకుని గుమ్మరించాను ఒక గుప్పెడు పువ్వుల్ని ఆమె ఒడిలో

రెండు లేత నిమ్మ కాయల్ని నా రెప్పల మధ్య రహస్యంగా దాచుకున్నాను. దానిమ్మ గింజలు కిసుక్కున నవ్వుకున్నాయి. చెట్ల నీడల్లో తమ అక్షతలని జల్లాయి.

రెండు పెదాలతో కోసుకున్నాను నా తపఃఫలాన్ని–ప్రేయసి అధరామృతాన్ని ! గ్రీష్మం మా ప్రణయాన్ని ధ్వంసం చేస్తూ ఉప్పునీటి ఊటని మా మధ్య ప్రవహింప జేస్తోంది.

విధిలేక కౌగిలించుకున్నాను ప్రకృతిని–నా రెండు కళ్ళ మధ్యా ఒక రక్త తిలకంలా అక్షరాన్ని అలంకరించుకున్నాను. నిండు గౌన్ల వృక్ష కన్యలందరూ నా వైపే చూస్తున్నారు తమ అర్ధ నగ్న నేత్రాలతో—

జీవితాన్నిచ్చిన సూర్యుడే నా వృక్ష కన్యలమీదా పూల మీదా తన మృత్యువలల్ని విసురుతున్నాడెందుకో !

ఒక మూర్తీభవించిన కాంతి నా కళ్ళలో గుచ్చుకుంది. గ్రీష్మం తాత్కాలికమేనంటూ సూర్య నమస్కారాలు చేస్తూ కళ్ళు విప్పుకుంది నా అంతర్నేత్రం

# సంజీవదేవ్

## నా కళ్లను చూడవు నా కళ్లు

చూస్తాయి నా కళ్లు
కొండలను కోనలను
చూస్తాయి
మన్నును మిన్నును
తారలను సితారలను
పశువులను పక్షులను
నా కన్నులు చూస్తాయి
నీలి మేఘాలను
మేఘం పైని ఇంద్ర ధనుసును
చూస్తాయి
పడవ తెరచాపను
తెరచాప పడవనుకూడ
చూస్తాయి సాగర దూరాలను
సరోవర తీరాలను
నా కళ్లు చూస్తాయి
పుష్ప నికుంజాలను
శ్మశాన వాటికలను కూడ
క్యాన్సర్ రోగులను చూస్తాయి
ఆరోగ్య జీవులను కూడ
చూస్తాయి ఉషస్సును
సాంధ్యరాగాలను
ఇతర్ల కళ్లను చూస్తాయి నా కళ్లు
ఇతర్ల కళ్లు చూస్తాయి నా కళ్లను
నా కళ్లు చూడలేవు
నా కళ్లను
అద్దం అండ లేనిది.

# టి. రామదాసు

## ప్రేమకోసం తపిస్తాయి

పూల బాలలు
ఆర్భాటపు ఆకర్షణలను
దండల అండను గాక
తల్లి ఒడి వెచ్చదనాన్ని
ఆశిస్తాయి
ప్రేమకోసం తపిస్తాయి.

వెండి గిన్నెలో పాలకంటే
మూగజీవులు
తల్లి గుండెల
అమృతపు మురిపాలను
ఆశిస్తాయి
ప్రేమకోసం తపిస్తాయి.

గూటిలోని గువ్వ కూనలు
బంగారు పంజరపు కాంతి కంటే
అమ్మ నోటి ఆహారాన్నే
ఆశిస్తాయి
ప్రేమకోసం తపిస్తాయి.

* * *

"శ్రమ జీవి చెమట బిందువులో
ఆణిముత్యమూ ఉంది
అగ్నిగోళమూ ఉంది"        —పి వా రె

# పాతూరి రఘురామయ్య

## కఠిన వాస్తవ తలంపై

వేయి వెలుగుల వేల్పు చూపులు
విరుల్లాగా పూస్తున్నాయి
కలల్లో కావ్యాల్లో మనిషి ప్రతి ఊహలో
నిజమే
ఒక మూల క్రమ్మింది నిశి
అవును నిజమే
అనల స్వప్నం కటువైన వాస్తవంగా
నెలకొన్నది ఒక మూల,
విశ్వంలో ఒక మూల దక్షిణాఫ్రికా
మన దేశంలో మరో మూల పంజాబు,
నలుగుతున్న ఒక నీగ్రో కంఠం
జాతీయ సుధానాద గీతులాలపించవచ్చు
అస్తమించిన ఒక కలం
రేపు.
ఆకసాన తారయై వెలుగొందవచ్చు.
మధుర సుధా గీతిలో
మూలలు కరిగిపోవా ?
అక్షరాకాశంలో
అనాహత శాంతి ధ్వని విస్తరించదా ?
కలల కాంతిగూళ్ళు కట్టుకున్నా మనిషి
కాళ్ళు మాత్రం కఠినమైన రాతి బండ వంటి
వాస్తవం పైనే-
దృష్టి ఎప్పుడూ సూర్యోదయం వైపే
మానసిక సమున్నత వికాసం పైనే !

## ఐతా చంద్రయ్య

### నా కళ్ళు

నా కళ్ళు
కయ్యానికి కాలు దువ్వుతాయి
స్వాహాకారులు ఛాలెంజి విసిరినప్పుడు
కుహనా సిద్ధాంతంతో రాద్ధాంతం రంకులాడినప్పుడు
సహనం ఒళ్ళు హూనమైనప్పుడు నా కళ్ళు
నెయ్యానికి అశ్రులు వొస్తాయి
నయవంచనను నడి బజార్లో ఉరితీసిన కరకమలాలకై
ఆరిపోతున్న జీవన జ్యోతుల్ని
వెలిగించిన కథల కౌగిళ్ళకై
నా కళ్ళు....
అగ్నులు కురిపిస్తాయి
అబల ఆటబొమ్మన్న
అడారి వెధవల గుండెల లోగిళ్ళో ...
అమాయకుల కంటి మైదానాల్లో
బొగ్గులు అలికిన భడవల బాటల్లో,
నా కళ్ళు
కలల అలల మీద అల్లాడుతాయి
కన్న కలలు కమ్మగా పండిన
కన్నె పిల్లల కనుసన్నల్లో
వెన్నెల సోయగాలు
వన్నెలు విరజిమ్మినప్పుడు.
నా కళ్ళు....
అమలిన బాష్పాలు రాలుస్తాయి
పక్కవాడి పంచలో
పచ్చదనం విచ్చుకున్నప్పుడు....
నవభారత నిర్మాణ యజ్ఞంలో
నేనూ ఒక సమిధనైనప్పుడు.

# టి. వి. ఎస్. రామానుజరావు

## నిద్ర పట్టని రాత్రి

ఏదో ఒక వార్త సంచలనమవుతుంది
ఆలోచనల గందరగోళం వ్యోమనౌకలా పల్టీలు కొడుతుంది
నిలువునా శిలువేసిన చూపుల రెప్పలు
చంద్రునిలోని లోతులగురించి, క్రేటర్ల గురించి
ఆల్జీబ్రా లెక్కలు కడుతుంది.
టిక్కు టిక్కుమనే గడియారం ముల్లు
టైం బాంబ్‌లా రాత్రంతా భయపెడుతూనే వుంటుంది.
నిన్నటి నిద్రాసౌఖ్యం గుర్తుండదు, రేపటి మాట రాదు.
చివరిక్షణం వరకు ప్రాణం నిలిపే పోరాటం
కాసేపటికి తెలవారుతుందని తెలిసే
నిముషం నిద్రపడితే చాలంటుంది.
లైటారిపోయి ఒకమారు, ఫ్యాన్ పోయి మరొకమారు
కెవ్వని చంటి కుర్రాడరుస్తే
తోడు దొరికిందని సంబర మవుతుంది
మూలిగి, అమ్మ డొక్కలో దూరి
నిదురించే చిన్నారిని చూసి
ఒంటరిగనే నిట్టూరుస్తాను.
ఎక్కడో ఓ మెరుపు మెరిస్తే
మరెక్కడో ఓ పిడుగు పడితే,
ఎంతమందికి నిద్రాభంగమైనదో
మరెంత మందికి నిరాశ్రయమైనదో
అవలీలగా మెదడు ఆలోచిస్తుంది.
అప్పుడప్పుడూ నిద్రలో లేచి, చూసి
'పడుకోరాదా' అనే పలకరింపులు
పలవరింతల్లా అనిపించి
ఇంత సౌఖ్యమూ వీళ్ళకెందుకని
మనసు అసూయతో మూలుగుతుంది.

# దేవరకొండ బాలగంగాధర తిలక్

## స్వయంవర

వాడటె నాదుస్వామి! తెలివాలుకనుంగవ రత్న దీపముల్
నీడల నీలిమం గదలు నిగ్గుల నిద్దపు ఠీవిదోచు, ఊ
గాడు కిరీటపుం గొనల కట్టిన కుచ్చుల మంచిముత్యముల్
చూడవె! శైలసానువుల సుందర వారిద చంచలాకృతిన్.

ఈ సుకుమారపు న్నెడద నాటిన దీతడె సుమ్మి! మాలతీ
హాసమరీచి, మల్లియల యౌవనపు న్నునుసిగ్గు, ఏలకీ
వాసిత చిత్రసౌరభము, పండిన సంపగి తావి మైకమున్
ధూసరమయ్యెనే వలపు తోరపుపుప్పొడిజల్లు వెల్లువన్?

ఏరమణీయసంధ్య రచియించితినోయి కపోలతల్ప మం
దార సుధాత్రపల్; అవియె దాసినిగా యుపదల్ గ్రహింపుమ
య్యా రఘుచంద్ర! యీవలపు లంటిన లేతవయస్సులో మరే
తీరున నీయుదాన గురుతింపగ నీవు మదార్ద్రచిత్తమున్.

తొలి తొలి జన్మలందు దయతో కలలో కనుపించి, కన్నులన్
వెలుగుల నింపి, చేత చెయివైచియు ప్రేముడి పూరు బాసలన్
పలికినవాడు నేడిటుల వచ్చెనుగాక యథార్థమై, మరీ
పులకలు ఏమె నాతనువు ముంచును స్వర్గముదాకసాగుచున్!

ఇతడటే పుత్రకామేష్టి యాగఫలమ్ము
దశరథానంద నందనవనమ్ము
ఇతడటే వెరపేది యింత వయసున రా
క్షసుల దున్మిన వాడి కత్తి మెరపు!

ఇతడటే రఘువంశ తతకీర్తి మద్గుణ
సంపదల్ ప్రోవైన చారుశీలి!
ఇతడటే సాకేతనుత యౌవతవనమ్ము
కన్నట్టి నెత్తావి కలలగుత్తి
ఇతడటే తండ్రి నన్ను నాగేటి చాలు
కదిపి వెలికి తీయకముందె కానుపించె!
నేముగాక లేక జనన మేల నాకు
స్వామి కోసము గాక నేనేమి కొరకు?

అతడు వచ్చెనొ లేదొ అల్లపందిళ్లన
ల్లడల పద్మాల తోరణలు విరిసె;
అడుగు కదిపినంత హల్లకమ్ములు పూచి
సభనెల్ల సౌందర్య సరసి జేసె;
పెదవి విర్నగవు తుంపెసలాడ మల్లెమొ
గ్గలవాన జల్లు జల్లులుగ కురిసె;
వాని గన్నంత నాలోని గుట్టెల్ల బ
యలుపడి పసపు సిగ్గులను బిమ్మె;

ఇదివలపొ! జన్మ జన్మాల నదుము సౌహృ
దమ్మొ! లోని ఆత్మలపిల్పొ! దాచుకొన్న
పుణ్యమో! దోచుకొన్న స్వర్భోగమో! ప
విత్ర మీక్షణ మీస్వామి వీక్షణమున.

వీనివెంత జేరి విడువగలను నేను
సుఖము లేని; రాణి సొగసులేని;
వీని పసుపుచాలు వెడలగలను నేను
అడవికేని; కడలి నడిమి కేని.

ఏలా రెప్పలు సంచలించు? వలపుల్ యింతేసి చిత్రమ్ము లౌ
నా? లేకన్ కనుగప్పు మాంత్రికములా? నాలోన లోలోనెదో
వేలావిస్తృత తంత్రులంగదలు; రావే నెచ్చెలీ! స్వామి నా
పై లీలన్ పరపించె చూపులవి రవ్వల్ రువ్వ పారీణతన్.

అదిగో సాగెను స్వామివిల్లుకయి, ఆ అందమ్ము ప్రాతస్సర
స్సదనోద్దీపిత రాజహంసవలె, ఆశాంతమ్ము శోభించు, కన్
తుదలన్ చూడవె! లౌకికావధుల నాందోళించు క్రొవ్వెల్గు సం
పద లోహెూచెలి! అతడే అతడు నా ప్రాణేశు డా జన్మమున్.

తాకినవిల్లు తాకినటు దాశరథి ప్రథితాంగుళీయక
శ్రీ కిరణాప్తిచే విరిగె చిత్రము నెచ్చెలి! నిక్వణ క్వణా
వ్యాకులమై ధనుస్సు-ఇటువంగిన నా యెద వింటితోడ కే
కీ కలహంసికా పిక శుకీరమణీయ సకాకలీ ధ్వనిన్.

హ్లాదహహాహాశిన్ దివిని అప్సరలేమొ నటించి పుష్ప వ
ర్షాదర మిత్తు రీవిధము; రా, చెలి! క్రమ్మెను మైక మేదొ, యీ
మోదము దేహమందు నొకమూర్ఛనగా శ్రుతివేయు; రమ్ము, న
న్నాదుము- పూలమాల నెటు లంతటవైతును నాదుస్వామికిన్.

చాలదులేవె యీయెడద స్వామి మనోజ్ఞతలన్ గ్రహింప, నే
తాళగలేను నా బ్రదుకు దాకిన మోదశతారభార మా
కేలను పట్టుకొన్న కటిగిర్పిన రత్నపుకట్టులోని హుం
దా లొలయించు వాడి మొహదాకొసలే మెరసెన్ మనస్సులో.

(భారతి, ఫిబ్రవరి 1959 నుండి)

# నృపరాణి

## కోకిలగానం

ఒక్క పద్దెంబునకు నెత్తు రొక్క బొట్టు
పట్టె చదువరి పల్లటీ ల్గొట్ట పల్కి
నావు. వాణికి సరిక్రొత్త యౌవనముగ
వారెవా! జాపువా! భేషువా! వహవ్వ!

కెరలి యెదగుమ్మి రక్కి అంకెకును రాని
భావ్య ఛందస్సు. దానినే పదును దేరు
వాఙ్మయాంకుశమును జూపి వంచినావొ
కనిపడేసితి వగణిత కావ్య సుతల.

షాజహాను ఘటిత తాజి యేమో గాని
అలతి యలతి పలుకు చలువరాల
తావకీన కవనతాజ్మహలా చంద్ర
తార తరణి గాగ ధరణి వెలుగు.

వర్ణభేద మహిష మర్దనకై నీదు
పలుకు గబ్బిలమ్ము కలయదిరిగె;
గొనబు త్రోవద్రొక్కి క్రొత్త పాళీ సమ
కూర్చు కొన్న కలము కులుకు లొలికె.

ఖండికల నూలు కైతమగ్గానవైవ
ఆంధ్రి కట్టెను కావ్య పీనాంబరంబు;
నాయికా నాదుకాత్మకామ్నాయ దిశను
ఖండకావ్యావతరణ భాస్కరుడవనగ.

సామ్యమున్న నీ "శ్మశానవాటిక" నట
వర్గ రసనలకును వలస వెడలె.
జబిరితేనె రక్తి సత్యహరిశ్చంద్ర
నాటకమ్ములోని కాటిసీను.

శిథిల శృంగారరస దుస్స్వేను డంటి
ప్రీలిపోయిన కవన పాంచాలి కొప్పు
స్వాదు కరుణారసార్ద్ర హస్తాలదువ్వి
సంస్కరించిన వాగ్భుమ! జాష్వ! పీష్వ!

"ఉద్యమము" ప్లాటు ఫార్ము, కేలూను గ్రీను
సిగ్నలయ్యె "జాతీయత" స్నిగ్ధగార్డు!
పద్య పట్టాలపై నూత్నభావ ధూమ
శకట మేతేరు సాహిత్య శకము నీది.

కుహూ కుహూల వసంత కోకిల యింతలో
యెచటి కెగిరిపోయె యెడద చీల్చి?
చెమ్మగిల్లు కనుల చేయార తుడిచిన
లాలి పాటలోన లయలు తప్ప.

*　　　*　　　*

"తెల తెలవారు జాముననె
తీర్చితి నా కవితాంజనమ్ము నా
కలములలోన, ఈ కరడు
గట్టిన గుండెల రక్తవాహినుల్
జలజల బార కుచ్చెళులు
జార్చెడి ఔషసరాగకన్య ఉ
జ్జ్వల మధురాధరోష్ఠమున
జల్లెద నా కవితామృతాంబువుల్"　　— దాశరథి

# ఆరు ఖండాల అనువాద కవిత

ఆరు ఖండాల ప్రపంచ కవిత అనువాదాలు కొన్నిటిని పోయిన సంచికలో ఇచ్చాము. ఇప్పుడు మరికొన్ని కవితల అనువాదాలను ఇస్తున్నాము. ఈ దేశ దేశాల కవితలు సమకాలీన కవితాత్మకు అద్దం పడుతున్నాయి.

దేవరాజు మహారాజు అనువాదాలు (ఆంగ్లంనుంచి)

## డెన్నిస్ బ్రూటస్ (దక్షిణాఫ్రికా)

### వృక్షాన్ని!

నేను వృక్షాన్ని—
గాలిలో కిర్రు కిర్రు మంటూ,
నిశీధి కావల మెలికలు తిరిగి,
మొండిగా పడివున్న క్షామాన్ని

నేను ఫలకాన్ని—
మెలి తిప్పిన రేకు సంకెళ్ళ ఫలితాన్ని !
అసమ్మతి నినాదాలు నినదించే
వాయు తరంగాన్ని
నేనొక గొంతుకను—
అనంతమైన ఈ నిశీధిలో అరుస్తూ అరుస్తూ,
ఎప్పటికీ ఓదార్చబడని శోకపు కేకను

## రుధిర వదీ దివసం

ప్రతి వత్సరం ఈ రోజు,
వాళ్ళు తమ పద ధ్వనుల్తో భూమి మద్దెల మోగిస్తారు
మంత్రాల గర్జనల్తో రక్తపు వాసనల్ని నిద్ర లేపుతారు
ఆబగా ఆ వాసనల కోసమే ముక్కులెగేస్తారు

తప్పిదం, వారిని అడవి మృగం గుహ లాంటి
ప్రాథమిక క్రౌర్యం వైపు పంపిస్తుంది
కాని ధూళిలో, దుమ్ములో
అంతటా వ్యాపించే మట్టి వాసనలో
భూమి సుగంధం నాకొస్తుంది
లేడి ఇసుక మీద వర్షం చెరిగే
భూమి సుగంధం నాకొస్తుంది
భూమి చుట్టూ వున్న అదే మట్టి సుగంధం!

కె. గోదావరి శర్మ అనువాదాలు (ఆంగ్లంనుంచి)

## ఆర్నాల్డొ దొస్ సన్తొస్ (అంగోలా)

### రక్త ఋతువు

కాఫీ చెట్లపై పూలు :

1

అవి ఇప్పుడు తెల్లగా లేవు
కాఫీ చెట్లపై ఆ కొత్త పూలు
ఇప్పుడు తెల్లగా లేవు
ఉషోదయపు ఎర్రటి మంచు చేరింది వాటి మీద
పూలమీద ఆ బిందువులు ప్రకంపిస్తున్నాయి
గుండెల్లా, చీలిన ఛాతీల్లోంచి పైకొచ్చిన గుండెల్లా.

నిరాకాశ ఋతువు :

2

అప్పుడు ఒక కొత్త దినం ఉద్భవించింది
    ఒక మంటలా
    నదికి నిప్పంటుకున్నట్టు
ఆ ప్రవాహంలో నేను కొట్టుకుపోయాను —
ఒక కేకల గుంపులా
    ఎముకల గుల్లల్లా
    లుంగలు చుట్టుకుంటూ
ఉలికులికి పడే కళ్లతో
    తెల్లగా అమానుషంగా
    ఒక నిరాకాశ ఋతువులో

నా హస్తముద్ర ఆఖరి వీడ్కోలుగా
నా ఆశయం ఆత్మహత్యా సదృశంగా.
    నా పేగుల్ని వెలికి తీసి
    ఈ ఋతువు ముఖం మీద విసిరేస్తూ.

సుమనశ్రీ అనువాదాలు (ఆంగ్లంనుంచి)

## గుంటర్ కునెర్ట్ (పశ్చిమ జర్మనీ)

### రోటింగ్ డీన్‌లో బొమ్మల మ్యూజియమ్

వెలిసి పోయిన రంగులతో
ఒక తగరపు పూత ప్రపంచం —
ఎప్పుడో ఆగిపోయిన గడియారాలు
బిగుసుకుపోయిన చూపులు
రాయిలాంటి ముఖాలు
లోపల్లోల నాట బడ్డ నవ్వులు
నిన్ను దాచుకుంటూ పోయే శుభాకాంక్షలు.

శాశ్వతంగా ఆ యిద్దరు సైకిల్ వీరులూ
ప్రయోగిస్తూనే వుంటారు
శాశ్వతంగా బిలియర్డ్స్ ఆటగాడు
కంతలోంచి బంతి బయట పడేదాకా
వేచి చూస్తూనే వుంటాడు
శాశ్వతంగా మరీ శాశ్వతంగా
ఆ యిద్దరు వైనీయులూ
ఒక రహస్యపు పెట్టెని
మోసుకుపోతూనే వుంటారు
ఎప్పుడేనా నువ్వు ధ్వంసమైన స్థలాల్లోనే చూడగలవు.

వాళ్ళ బిగుసుకుపోయిన చూపులు
రాయయి పోయిన ముఖాలు
ప్రాణం పోసుకున్నప్పుడు
రాత్రుళ్ళు వాళ్ళ ప్రేయసుల శరీరాల్లో
బాధనో ఆనందాన్నో కలిగించాయి.

తగరపు పూత ప్రపంచం
స్వప్నాలని రేపుతుంది
ఇతరేతర రేఖల వెనక దాగిన
వస్తువుల్ని మన ఎదుట నిలుపుతుంది.

## ఆక్టేవియో పాజ్ (మెక్సికో)

### మరొకటి

అతడు తనకోసం
మరో కొత్త ముఖాన్ని సృష్టించుకున్నాడు
దాని వెనకాల
అతడు జీవించాడు, మరణించాడు
పునరుత్థానం చెందాడు, ఎన్నోసార్లు.

ఈ నాడతని ముఖం ముడుతలు పడివుంది
అయితే ఆ ముడతలకి మాత్రం
ఏ ముఖమూ లేదు.

### స్నేహం

అది నేనెదురు చూస్తున్న ఘడియ
దీపం విరబోసుకున్న శిరోజాలు టేబిల్ మీద
అంతులేకుండా పరుచుకున్నాయి
రాత్రి కిటికీని అనంతంగా తెరుస్తోంది
ఇప్పుడు ఇక్కడ ఎవరూ లేరు
పేరే లేని అస్తిత్వం
నన్నిప్పుడు చుట్టుముడుతోంది.

## గియోవాని రబోని (ఇటలీ)

### టేబిల్ క్లాత్

మిత్రులతో మాట్లాడి ప్రయోజనమేమిటి ?
అందరూ కోపం తెచ్చుకునే వాళ్ళే
కాకుంటే నవ్వుతూ తలలు బాదుకునే వాళ్ళే
నువ్వు నీ డబ్బు సమస్యల్ని గురించి
పాటగాళ్ళు ముసలాళ్ళయి పోవడం గురించి
చిక్కి పోవడం గురించి చర్చిస్తావు
బయట రాత్రి గుడ్లగూబలా పొగరెక్కి పోతుంది
మనం చాల కొద్ది మందిమి
ఇన్ని అభియోగాల్ని భరించడానికి
మనం చాల కొద్ది మందిమి-
టేబిల్ మీద అమర్చబడ్డ
గుడ్డూ, రొట్టెముక్కా, గ్లాసూ
మనల్ని బాధించే సున్నితమైన ఆయుధాలు.

# ఇటీవల వెలువడిన కొన్ని కవితా సంపుటాలు

1. 'నేత్రం నా సంకేతం'—డా. సుమనశ్రీ, ప్లాట్ నెం. 104, కల్యాణ నగర్, వెంగళరావు నగర్ (పోస్టు), హైదరాబాదు-500890 (వెల : 10 రూ.)
2. 'రూపభేదం'—వనమాలి, విశాలాంధ్ర బుక్‌హౌస్, 4-1-435, బ్యాంక్ వీథి, హైదరాబాదు-500001. (వెల : 4 రూ.)
3. 'కాంతిస్వప్న'—డా. జి. వి. పూర్ణచందు, శుశ్రుతాక్లినిక్, విద్యాధర పురం, విజయవాడ-520 012. (వెల : 8 రూ.)
4. 'త్రిశంకునరకం'—చల్లారామఫణి, డి. ఆర్. డి. యల్., మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సు, కాంచన్ బాఘ్, హైదరాబాదు-500 258. (వెల : 12 రూ.)
5. 'గొంతులు విగిర్చాయి'—(రంజని-కుందుర్తి అవార్డు కవితలు) : రంజని, తెలుగు సాహితీ సమితి, అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసు, హైదరాబాదు-500 463 (వెల లేదు)
6. 'స్పందన'—డా. టి. రామదాసు, స్పందన సాహితీ సమాజ్య, 24-317 రామానాయుడు పేట, మచిలీపట్నం-521 001. (వెల : 8 రూ.
7. 'కనువిప్పు'—చైతన్య ప్రకాశ్, కొండాపూర్ పోస్టు, కిషన్‌దాసపేట-505 303. (వెల : 5 రూ.)
8. 'మహోదయం'—బూర భిక్షపతి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-500 001. (వెల : 10 రూ.)
9. 'విజ్ఞాన వాసంతం'—వసంతరావు వేంకటరావు, 453-బి, ఎం.ఎస్. ఎం. కాలని, జ్ఞానపురం, విశాఖపట్నం-530 004. (వెల : 7 రూ.)
10. 'స్పందన'—పి. శాంతమ్మ, తెలుగు లెక్చరర్, జి. జె. కాలేజి, గజపతి నగరం, విజయనగరం జిల్లా. (వెల : 5 రూ.)
11. 'రహస్య చిత్రం' బి. అయిలయ్య, ఇంటి నెం. 3-4-93/ఎ రాయ పురం, హనుమకొండ, వరంగల్లు- 506 001. (వెల : 10 రూ.)
12. 'స్త్రీ'—కొల్లూరి, ఎడిటర్, 'ఎక్స్‌రే' పబ్లిషర్స్, కొల్లూరి హౌస్, అమలా పురం, తూర్పు గోదావరి జిల్లా-533 201. (వెల : 6 రూ.)

13. 'మోహనా! ఓ మోహనా!'—కె. శివారెడ్డి, 6-1-711, ఖైరతాబాద్, హైదరాబాదు-500 004. (వెల : 10 రూ.)

14. 'వసంతగీతం'—చందుహర్షవర్ధన్, స్పందన సాహితీ సమాఖ్య, రామానాయుడుపేట, మచిలీపట్నం-521 001.(వెల : 15 రూ.)

15. 'అక్షర సూర్యుడు'—ఒబ్బిని, సి. పద్మావతి, 5-82/1 భవానీనగర్, దిల్ సుఖ్ నగర్. హైదరాబాదు-500 660. (వెల : 10 రూ.)

16 'నేను సూర్యుడైన వేళ'—కాణిపాకం లింగన్న, పద్మశ్రీ అండ్ కో, చిత్తూరు. (వెల : 15 రూ.)

17. 'హోరుగాలి'—శిఖామణి, బుక్ సెంటర్, మెయిన్ రోడ్డు, విశాఖ పట్టణం. (వెల : 6 రూ.)

18. 'వెన్నెలపిట్ట'—విజయసారథి; 'అగ్నిపుట్ట'—మాధవీ సనారా విజయసారథి. ఆంధ్రా హైస్కూలు. ఖరగ్‌పూర్-721 301. (వెల లేదు)

19. 'అధర మందారం'—విజయసారథి; కావ్య పబ్లికేషన్స్, 6-3-596/54/1 వెంకటరమణా కాలనీ, హైదరాబాద్-500 004. (వెల: 2 రూ.)

20. 'అగ్నిమయం జీవితం'—మాదిరాజు రంగారావు; క్వార్టర్ నెం. 14) కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి, వరంగల్లు-506 009. (వెల : 1రూ.)

21 'అగ్నిమయం జీవితం'—మాదిరాజు రంగారావు...... (వెల : 5రూ.)

22. Word Fire—Acharya Tirumala (Tr. Santi Swaroop) Chaitanya Kalasala, Karman Ghat, N. S. Road, Hyderabad-5. (Price : Rs 25-00)

23. The Mirror of Time—Acharya Tirumala, (Tr. S.T.V. Raghavacharya) (Price : Rs. 25-00)

# చైతన్య కవితా వేదిక

## పోషకులు (1989)

శ్రీయుతులు

26. భాగీరథి, ఆచార్య కొలకలూరి ఇనాక్ దంపతులు, అనంతపురం
27. గౌరమ్మ, ఎస్. శ్రీనివాసన్ దంపతులు, బెంగుళూరు
27. కె. రాధాకృష్ణయ్య, కల్లూరు, అనంతపురం జిల్లా

## జీవిత సభ్యులు (1989)

శ్రీయుతులు

110. రామసూరి, విజయనగరం
111. ఇ. నాగరాజు, బేగార్ల పల్లె, అనంతపురం జిల్లా
112. సి. వి. యన్. ధన్, గుంటూరు
113. శ్రీమతి ఇందిరాగాంధి మెమోరియల్ లైబ్రరీ, హైదరాబాదు విశ్వ విద్యాలయం, హైదరాబాదు
114. డా. నడింపల్లి శ్రీరామరాజు, హైదరాబాదు
115. టి. వి. రుక్మిణి, హైదరాబాదు
116. బి. విద్యాసాగరరావు, హైదరాబాదు
117. ఆచార్య పి. ఎస్. సుబ్రహ్మణ్యం, అణ్ణామలైనగర్
118. అడిగోపుల వెంకటరత్నం, నాగార్జుననగర్
119. టి. ఎస్. గిరిప్రకాష్, మదురై
120. సిరివెన్నెల సీతారామశాస్త్రి, మద్రాసు
121. డా. తిరుమల రామచంద్ర, హైదరాబాదు
122. యస్. శారదాదేవి, బెంగుళూరు
123. యస్. నాగమణి, బెంగళూరు
124. ఆచార్య పి. వేణుగోపాలరావు, యు.ఎస్.ఎ.
125. శికాకొల్లు లక్ష్మి, విజయవాడ
126. డా. బి. కోటివీరాచారి, వరంగల్

## ప్రత్యేక సభ్యులు (1989)

27. డా. డి. ఆర్. నాగరాజు, బెంగుళూరు

# చైతన్య కవిత

శుక్ల శరత్తు **8** AUTUMN 1989



ఆంధ్ర కవితా విశ్వనాథుని
బ్రాహ్మీమయమూర్తి